# నీలికళ్ళు



రచన

బాల్‌జాక్

అనువాదం

బెల్లంకొండ రామదాసు






పబ్లిషర్స్

భవానీ పబ్లిషింగ్ హౌస్

పుయ్యూరు

(కృష్ణా జిల్లా)

1



# 1

**భ**యం తన విశ్వరూపాన్ని ఎక్కడ ప్రదర్శిస్తున్నదని ప్రశ్న వేసుకుంటే పారిస్ నగరంలోనని జవాబు చెప్పుకోవాలి. ఎటు చూచినా కనరాని ప్రజలు పాలివారిపోయిన వదనాలతో నీడల్లా నడుస్తూ వెడుతూ మనకి కనుపిస్తారు. పారిస్ నగరాన్ని గురించి ఒక్క ముక్కలో చెప్పాలంటే అనుక్షణం తుఫానుతో భయచలితం చేసే ఆకాశమండల మనవచ్చు. ఎడతెరిపిలేని మానవసమూహ విలయ కల్లోలం ఆ ఆకాశం వెనుకనుంచి సాగరఘోషలా వినిపిస్తూనే ఉంటుంది. జీవన మరణాలు వీరిలో ప్రతిక్షణం బంతులాడుతూనే ఉంటాయి. కుంచించుకుని మెలికలు తిరిగిన వికృతవదనాలు — ప్రతివదనంలోనూ ప్రతి అణువులోనూ — వారి మనస్సుల్లో మసిలి మసిలి పేరుకున్న వాంఛలు విషాలు గడ్డకట్టి కనుపిస్తాయి. ఆ ముఖాలను ముఖాలని పిలవడంకంటె ముసుగులని పిలవడం మరింత ఉచితం. ముఖాలు చాటుచేసుకుని తగిలించుకున్న ముసుగులు, ఒక ముసుగుచాటున సుఖం. మరో ముసుగుచాటున దుఃఖం, అన్ని ముఖాలు ఇలాంటివే. ఏవేవో కథలతో వ్యధలతో అనుక్షణం చలించిపోయే ముఖాలు, వాడిన నీడలు. కొన్ని ఎండుటాకులు కొన్ని పండుటాకుల్లా రాలీరాలక ఊగిస

లాడేవి, ప్రతి ముఖంచాటున ఏదో బాధ. ఏదో గాథ, ఏదో ముద్ర. అందని ఆశలు, ఆరిన ఆశయాలు. ఏవేవో కథలతో వ్యథలతో అనుక్షణం చలించిపోయే ముఖాలు, కొన్ని ఎండుటాకుల్లా రాలిపోయేవి. కొన్ని పండుటాకుల్లా రాలీరాలక ఊగిసలాడేవి. ప్రతి ముఖంచాటున ఏదో గాథ, ఏదో బాధ. ఏదో ముద్ర, అందని ఆశలు, ఆరిన ఆశయాలు. ఇంతకూ వీరంతా కోరేదేమిటి? దేనికోసం ఈ బాధ? ఈ తపన? ఇలా ప్రయాణం చేస్తారు అక్కడి మనుష్యులంతా, ఎక్కడికో ఎందుకో ఎవరికీ తెలీదు. ఎవరో పిలుస్తున్నట్లు ఆ పిలుపు వలనుంచి తాము తప్పుకోలేనట్టుగా ఒక మహా ప్రవాహంలాగ కొట్టుకునిపోతారు. ఇంతకూ ఏ తీరనికోరిక వెయ్యి చేతులెత్తి పిలుస్తూంటే వీరంతా వెడుతున్నారో! ఎక్కడికి వెడుతున్నారో! కాంత పిలుస్తూంటే వెడుతున్నారో మరికాంచనం పిలుస్తూంటే వెడుతున్నారో! ఏ రహస్యం వీరిని పాశాలుచుట్టి అలా లాక్కునిపోతోందో! పారిస్ నగరపు హృదయాన్ని చీల్చి పరిశోధిస్తేకాని మనకీ రహస్యం తెలీదు. పారిస్ నగరపు జీవితంలో రెండే రెండు దశలున్నాయి, ఒకటి యౌవనం. రెండవది పతనం. ఈ రెండు కొమ్మలకూ కట్టుకుని ఊగే ఊయల పారిస్. యౌవనం తొలిదశ, పాలిన యౌవనం, రక్తిమలేని యౌవనం. ఇక రెండవదశ పతనం, యౌవనంలా తొణికిసలాడుతూ కనుపించే పతనం. ఎవరైనా పరదేశస్థులు పారిస్ నగరం వచ్చారంటే తొలిగా ఈ రెండు దృశ్యాలూ కనుపిస్తాయి. అప్పుడు వారికి పారిస్‌పట్ల ఒక విధమైన విరక్తికూడా కలగకపోదు, అనుక్షణం ఆనందం కొత్త కొత్త రూపాలతో

వుత్పత్తి అయ్యే పెద్దకార్ఖానాలా కనుపిస్తుంది పారిస్. ఇక వారుకూడా ఆ మరనుంచి తప్పుకోలేరు, అక్కడే ఉండి అందులో భాగమైపోతారు. ఆ పతనంలో తామూ చోటు చేసుకుని స్థిరపడిపోతారు. పారిస్ వదనాలచాటున పీట పెట్టుకున్న విచిత్ర రహస్యాన్ని వివరించడానికి ఈ కొద్ది మాటలు చాలనుకుంటాను, అంచాతనే పారిస్ నగరాన్ని స్వర్గపు పూత పూసుకున్న నరకమంటారు. ఇది ఏమాత్రం అసత్యం కాదు. ఎటుకన్నా ఏదో పొగ, ఏదో జ్వాల, ఊపిరి సలుపని పొగ. ఎటు విన్నా కన్నా ఏవేవో మెరుపులు, పెటపెటలు, మంటలు మెల్లగా మండి రగిలి రగిలి చల్లారి ఆవిరిగా మారే మంటలు, మళ్ళీ ఇట్టే ఉండి ఉండి మండుతాయి. ఉవ్వెత్తున లేస్తాయి, మళ్ళీ ఇట్టే దాగిపోతాయి. పాములు పుట్టల్లోకి వెళ్ళినట్టు వెళ్ళిపోతాయి. మరే దేశంలోనూ జీవితం ఇన్నిరూపాల్లో, ఇన్ని తాపాలతో ఇంత విచలితంగా ఇంత కత్తి వాదరలా కనుపించదు. ఇలా సన్నని జ్వాలలా రగలదు. ఇక సంఘ స్వభావం, ఒక స్థిమితం లేనిది. ఎప్పుడూ కరుగుతూనే ఉంటుంది, పాదరసంలా ప్రవహిస్తూనే ఉంటుంది. ప్రకృతి లాగానే ఏ క్షణానికి ఆ క్షణం ఒక కొత్త అవతారం. ప్రకృతిలో లాగానే ఈ స్వభావంలోకూడా, ఎప్పుడూ ఏవో కొత్త పూలు పూస్తూనే ఉంటాయి. కొత్త తుమ్మెదలు ఝుమ్మని రొదనచేస్తూ మొలకలెత్తుతూనే ఉంటాయి. కొత్త సీతాకోక చిలుకలు రంగు రంగుల రెక్కలు రెప రెపలాడిస్తూ తరలి వస్తూనే ఉంటాయి. ఎప్పుడూ ఏదో రొద సొద సాగుతూనే ఉంటుంది. అంతలో అవి మబ్బు తునకల్లా మాయమైపోతాయి.

మళ్ళీ ఇట్టే కూడుకుంటాయి. ఇలా ఒక పెద్ద వనంలా పారిస్ కొత్త తొడుగులు తొడుగుతూనే ఉంటుంది. ఇలా అనుక్షణం మార్పు చెందుతూ ప్రవాహంలా సాగిపోయే ఈ జాతి మానవుల ముఖాల తీరులకు ప్రత్యేక కారణాలు విచారించడానికి ముందు ఆ ముఖాలను అనుక్షణం మార్పు చెందేట్లు చేసే సాధారణ కారణాన్ని మనం విచారించాలి. ఒకోసారి ముఖాలు నీలిమ వర్ణం ధరిస్తాయి, మరోసారి ధవళ వర్ణం ధరిస్తాయి.

పారిస్ నగరవాసిలో ఒక విచిత్ర లక్షణం ఉన్నది. అన్ని విషయాల్లోనూ అతను ఆసక్తి ఉన్నట్లు కనుపిస్తాడు. కాని అతనికి ఏ విషయంలోనూ ఆసక్తి ఉండదు. అతని ముఖంలో ఏ ఉద్వేగమూ కనుపించదు. సంఘర్షణ అతని ముఖాన్ని పిండి బొమ్మగా తయారుచేసింది. అతని ముఖాన్ని తుడిచింది. అంచాత అతని ముఖం అన్ని రకాలైన దుమ్మూ ధూళీ పడి పొగచూరిన నీడలా కనుపించే ఇంటిగోడల్లా ఉంది. ఇక పారిస్ నగరవాసికి రేపన్న చింత అసలే లేదు. అంచాత ఇవాళ్టి రోజుని పసిపిల్లాడిలా గెంతుతూ హాయిగా గడిపేస్తారు. అతని వయస్సు ఏదైనా అతనెప్పుడూ పసివాడే. ప్రతి చిన్న విషయానికి అతను మారాం చేస్తాడు. మళ్ళీ తనని తానే ఓదార్పు చేసుకుంటాడు. ప్రతి దాన్నీ ఇదేనా అని ఇట్టే నవ్వేస్తాడు. మళ్ళీ ఇట్టే దాన్ని మరిచిపోతాడు. ఆ తలపు వీరేస్తాడు. మళ్ళీ అందులోనే అభిరతి చూపుతాడు. దాన్నే కాంక్షించి వాంఛిస్తాడు, వాంఛించిన దాన్నే మరిచిపోతాడు. అన్నీ రుచి చూస్తాడు, రుచి చూడందే దేన్నీ వదలడు. అన్నీ ఆతురంగా

కౌగిట్లోకి తీసుకుంటాడు, ఆ మరుక్షణమే ఆవలికి బంతిలా తన్నేస్తాడు. అతని రోజులు — జయాపజయాలు — కీర్తి ప్రతిష్ఠలు — శిల్ప చాతుర్యాలు — అన్నీ అతనికి ఒకలాగే కనుపిస్తాయి — దేన్నీ లెక్క చెయ్యడు. తన సాకింగ్సును, హాట్లను, అస్త్రిపాస్తులను గిరాటు వేసినట్టు వాటినికూడా గిరాటేస్తాడు. పారిస్ మహాప్రవాహాన్ని ఏ హృదయస్పందనా ఎదుర్కోలేదు. ఆ ప్రవాహంలో అన్ని స్పందనలూ కొట్టుకునిపోతాయి, ఆ ప్రవాహపు ఆటుపోట్లలో ఉద్వేగాలన్నీ విరతి చెందుతాయి. ప్రేమ ఒక కోరికగా మారుతుంది, ద్వేషం ఒక మజాగా మారుతుంది. ఇక ఆప్తులంటూ బంధువులంటూ ఎవరూ లేరు. వెయ్యి ఫ్రాంకులనోటు ఒకటే బంధువు. తాకట్టు వ్యాపారి కంటే స్నేహితుడూ ఆత్మీయుడూ మరొకడు లేడు, అంచాత వారు వీరనే తేడాలు లేవు. ఎవరివల్ల కాని పెద్ద హానీ లేదు, పెద్ద ఉపకారమూ లేదు, అంచాత అన్నీ చల్లగా సహించి ఊరుకోవడమే. మంచినీ చెడ్డనీ, దొంగల్నీ ఫుండాకోర్లనీ, పెద్దలనూ చిన్నలనూ, వీధుల్లోవారినీ దుకాణాల్లో వారినీ — అంతా ఒకే కొలతబద్దతో కొలవడమే. అక్కడ సహించక పోవడమంటూ ఏమీలేదు, ఏలే రాజూ ఉరితీశే తలారీ ఇరువురూ ఒకటే. మతం, కలరా ఒకే పాత్రలో పోసుకుని సేవించవచ్చు. ఈ లోకం తలుపులు నీకోసం ఎప్పుడూ తెరిచే ఉంటాయి, గేటు కాపలాదారు నిన్ను ఆపుచెయ్యడు. నీవు ఎప్పుడువచ్చినా యెవరుకాదనరు, నీవుసరాసరిలోపలికిరావచ్చు. ఇక నీకు ఒక చిన్న సందేహం రావచ్చు, ఈ జాతికి ఒక నీతి లేదు, నియమం లేదు, ఎందులోనూ విశ్వాసం లేదు. ఒక

మతమంటూ తగలడిందిలేదు, దేనికీ తుదీమొదలూ కనుపించదు. ఇక ఈ జాతిని నడిపిస్తున్న దేదని నీవడగవచ్చు, ఏదంటావా? ఒకటి బంగారం, రెండోది సుఖం. ఈ రెండూ రెండు దీపాలనుకో. ఈ రెండు దీపాలు పుచ్చుకుని లోపలికి వెళ్ళు. అప్పుడు కాని నీకీ గుహాలోని ఆంతర్యాలు తెలీవు. ఈ గుహా ఎన్ని కోనలూ మలుపులూ తిరుగుతుందో ఏ కొనచాటున ఏది దాక్కుని ఉందో నీకు బోధపడదు. ఆలోచిస్తావుకదూ మరి!...ఆలోచించు.

కూలీ___చేతులు, నాలుక, వెన్ను, కుడిచెయ్యి అయిదు వేళ్ళు ఉపయోగించుకుని పొట్ట పోసుకుంటాడు. అందుకోసం తన శక్తినంతా ధారపోస్తాడు. భార్యనుకూడా ఏదోఒక నురకు కట్టేస్తాడు. శిశువును శుష్కింపచేస్తాడు, ఏదో ఒక చక్రానికి బంధిస్తాడు. ఇక ఉత్పత్తిదారు _ అతని విషయం మరీచిత్రంగా ఉంటుంది. వీరందరినీ బంధిస్తున్న బంధం ఇంతవరకూ నాకు అర్థం కాలేదు. మలిన హస్తాలతో పోర్సిలియన్ బొమ్మలు చేస్తారు. కోట్లూ దుస్తులూ తయారుచేస్తారు. కాగితాల పూలు, పూలు దుస్తులు, గ్లాసులు, పాలరాతి వస్తువులు _ ఒకటేమిటి _ ఇలాటివి ఎన్నెన్నో వీరి మలిన హస్తాలే సృష్టిస్తాయి. ఇలా నెమ్మది నెమ్మదిగా ఈ జూదంలో వీరు ఎక్కడికో పైకి ప్రాకిపోతారు.

ఇలా వేచి కాచి పస్తులుండి బాధలుపడి బ్రతుకుయాత్ర సాగిస్తారు. చివరకు రేపన్న విషయం కూడా ఆలోచించక సుఖంకోసం ఒకరోజు రాజాలై వెలుగుతారు. ఉన్నది కాసు కూడా మిగల్చక ఏనాటి డబ్బు ఆనాడే వెదజల్లుతారు.

జూదాల్లో, వినోదాల్లో, విలాసాల్లో మునిగిపోతారు. విలువ లేని వెలయాండ్రను కూడ విలువపెచ్చి కొనివేస్తారు. ఆట లోనో పాటలోనో పూలు చల్లినట్టు డబ్బు విరజల్లి వేస్తారు. అయిదురోజులవరకూ అహారహాలు ఇలా పారిస్ నిద్రపోదు. తను శుష్కించి పాలిపోయే విచిత్ర క్రీడల్లో విహరిస్తూగడుపు తుంది. తరువాత మెల్లగా తన ఆనందం అవనిక జార్చుకొని అలసట తీర్చుకుంటుంది. కైపుతో తెల్లనే ఆనందంతో పసుపు రంగు పూవులా కనుపిస్తుంది. ఇలారెండు రోజులు ఏది ఉదయం ఏది అస్తమయం అన్న గమనం లేకుండా బ్రతుకు అందగత్తెలా నృత్యకేళి సలుపుతుంది. కాని మరుసటిరోజు కంచం ఖాళీగానేఉంటుంది. వారమంతా పస్తు. భార్యకు బట్ట లుండవు. పిల్లలు చిరిగిన దుస్తులతో వ్రేలాడుతారు. అందం కోసం పుట్టిన పురుషులు_ అందరికీ అంతో ఇంతో అందం ఉంటుంది_ అందానికి దూరమై, శక్తికి, సుత్తికి, మగ్గానికి, మరకు దాసులై అణికి ఆవిరై పోతారు.

డబ్బు_ సుఖం_ ఈ రెండిటికోసం అర్రులుచాచి పరు వులు తీస్తారు. అయినా ఎన్నో చేతులు బిచ్చమడుగుతూనే ఉంటాయి. న్యాయంగా కూలీ ఇప్పించమని కోరుతూనే ఉంటాయి. అయిదు ఫ్రాంకులైనా ఇప్పించకపోతే ఎలా అని పారిస్ వేశ్యలు కోరుతూనేఉంటారు. ఇలా ఇంచు మించు ముప్ఫయిలక్షలమంది ఈ విష వలయంలో తిరుగుతూనే ఉంటారు. ఈ మధ్యవర్తులే లేకపోతే ప్రతిమంగళవారం ఒక ప్రభుత్వం మారి ఉండేదికాదూ. ఇలా మంగళవారం వచ్చే సరికి వీరంతా ఆనందాన్ని మెడవరకూ మెక్కి హాయిగా

నిద్రిస్తారు. మరుసటిరోజు కళ్ళు తెరిచి చూస్తే దమ్మిడీఉండదు. జేబులుఖాళీ. మళ్ళీ మామూలు. ఎవరిపనులు వారివి. అయినా వీరిలో సహజంగా కొన్ని మంచిలక్షణాలు లేకపోలేదు. వీరిలో కొందరు నెపోలియన్లు దాగిఉండకపోరు. వీరి అంతర్గత శక్తి అప్పుడప్పుడూ పరిపూర్ణంగా అవతరించే క్షణాలు లేక పోలేదు. భావగమనాలు కలిసి ఆనందంగా పరిణమించకనూ పోవు.

అంతా అదృష్టం. అదృష్టం పనివాణ్ణి పొదుపుగాఉండేట్లు చేసింది. అదృష్టం అతనికి దూరదృష్టినిచ్చింది. అందువల్లనే అతను ఒక అమ్మాయిని వరించి తనను భార్యను చేసు కున్నాడు. బిడ్డల్నికని తను తండ్రి అయ్యాడు. కొన్ని సంవత్స రాలు కష్టంచేసి తనే ఒక చిన్నదుకాణాదారయ్యాడు. రోగం కాని భోగం కాని అతనికి అడ్డు తగిలి అతన్ని హరించకపోతే- అతని బ్రతుకు పండుగరోజల్లే సాగిపోతే- ఇక అతని బ్రతుకూ హాయిగా సాగినచల్లని బ్రతుకనే అనవచ్చు.

ఇక మనం పారిస్‌నగర కార్యకలాపాలన్నిటికి రాజైన వానికి మన నమస్సులందజేయాలి.

అతను రాత్రిళ్లు భార్యతో శృంగారం కావించి పారిస్ సంతానాన్ని వృద్ధిచేస్తాడు. పగలు తనవ్యక్తిని సేవకోసం కీర్తికోసం తోటివారికోసం నెచ్చింపచేస్తాడు. ఒకవైపున తన గృహిణి సమస్యలూ తీరుస్తాడు. మరోవైపున లోకాన్నీ సరి దిద్దుతాడు. రాజ్యాంగం, ఉద్యోగం, దేశరక్షణ, సంగీత సాహి త్యాలు- సరిచూచుకుంటాడు. కాని అంతా ఎందుకంటారా? ప్రభుత్వం, ఆఫీసు, సంగీతసాహిత్యాలు, భార్య, భగవంతుడు,

అన్నీ ఆ కాసుకోసమే. ఇన్ని ముఖాలుగల ఆ మనిషి మనకు ఎంతో వింతగా కనుపిస్తాడు. ఉదయం అయిదుగంటలకు ప్రతి నిత్యం పక్షిలా 'రూమాంట్ మర్ఫి'లో ఉన్న తన ఇంటినుంచి ఆకాశంలోకి ఎగిరిపోతాడు. వర్షం కురుస్తున్నా సరే, పిడుగులు పడుతున్నా సరే, మంచు సోనలువారుతున్నా సరే, కార్యాలయంలో ఉండితీరాలి. న్యూస్ పేపర్లు పంచాలి. ఈ వార్తల రొట్టెను వేగంగాపుచ్చుకుని అందరికీ పంచడానికి తుర్రుని ఎగిరిపోతాడు. మళ్ళీ తొమ్మిదిగంటలయ్యేసరికి గూడు చేరుకుంటాడు. ఇల్లాలు ఎదురుచూస్తూఉంటుంది. ఒక చిన్నిపరాచికాన్ని ఇల్లాలిపై విసిరేశి చెక్కిలి చక్కగా ముద్దాడి ఒక కప్పు కాఫీ పుచ్చుకుంటాడు. పిల్లలంతా కాళ్ళచుట్టూచుట్టుకుంటారు. వాళ్ళకు ఏవో అవీఇవీ కబుర్లు చెబుతాడు. పదిగంటలకు ఇక పదిహేను నిమిషాలు ఉన్నాయనగా మేరియాగగగ ప్రత్యక్షం. అక్కడ పంజరంలో చిలకలా తన స్టూలుపై ఫైళ్లు ముందు వేసుకుని సాయంత్రం నాలుగయ్యే వరకూ కూచుంటాడు. జనన మరణాల జాబితా లెక్కలుచూస్తూ కూచుంటాడు. ఆ ఊరి సుఖం, దుఃఖం రెండూ అతని కలంనుంచి సిరాగా ప్రవహిస్తాయి.

అతనికి బరువులేమీఉండవు. సూటిగా వెడతాడు. దారిలో మలుపులుండవు. వార్తాపత్రికల్లో భావాలే అతనివీ. ఎవరిమాటా కాదనడు. లోకం అవునని కరతాళధ్వనులు కావిస్తే తనూ శృతికలుపుతాడు. ఇలా పక్షిలా అతనిజీవితం హాయిగా సాగిపోతుంది. ఎప్పుడోకాని ఊరుదాటివెళ్ళడు. వెళ్ళినా అదీ ఆదివారాలనాడు. ఏ ఎసిస్టెంటునో తన పని

కొంచెం చూడమని చెప్పి వెడతాడు. చర్చికి అలంకారం తను. చక్కని గొంతుక సారించి నోరువిశాలంగావిప్పి 'ఎమెన్' అంటాడు. నాలుగుగంటలకు ఆఫీసు పంజరం తలుపులు తెరుచు కుంటాయి. తను రెక్కలు విదుల్చుకుంటూ బైటపడతాడు. ఇహ నగరంలో దుకాణాల దృశ్యాన్ని చూస్తూ నడకసాగి స్తాడు. భార్యతో కలిసి షాపింగ్‌కు వెడతాడు. అతని భార్య అచ్చంగా ఇల్లాలు. ఏ అరమర అసూయలేనిది. అతనికి అంత చక్కని భార్యఉందని అసూయపొందడానికి కూడా క్షణం తీరిక ఉండదు. అతను తనపని తానుచూసుకుని పోయేవాడు కాని చలచిత్తుడుకాడు. అతను దుకాణంలో అడుగుపెట్టా డంటే చాలు కౌంటర్ దగ్గర పిల్లలు ఉలికిపడిపోతారు. జిగేలు మనే వారికళ్ళు చూడగానే కష్టమర్ల కాళ్ళు తడబడిపోతాయి. అతను దుకాణంలోని చక్కని దుస్తులను సిల్కులను లేసు లను మస్లిన్ కర్చిఫ్‌లను ఒకమాటు పరికిస్తాడు. ఇవన్నీ ఆ అలివేణుల లలిత కరాంగుళులు మెల్లగా అల్లినవే. నెమ్మదిగా దుకాణంలో భార్యకు ఒకగౌను కొనుక్కుని ఇల్లుచేరు కుంటాడు.

ఇంటికి వెళ్ళగానే భోజనం సిద్ధంగా ఉంటుంది, కాని వెంటనే భోజనానికి వెళ్ళడు. చూడవచ్చిన చుట్టంతో మాట్లాడుతూనో న్యూస్‌పేపర్ చదువుతూనో గడుపుతాడు, లేక గేట్ కాపాలాదారుకు మరిచిపోయిన మరేవైనా సామాన్లు అందించడంలోనో గడుపుతాడు. మరే రోజై యినా ఆరుగంటలయ్యేసరికి తన పనిలో తాను కచ్చితంగా ఉంటాడు, అతనికి నాటకాలు చూడాలంటే ఎంతో ఇష్టం

వారానికి ఒక్క మాటయినా సంగీత నాటకం చూచితీరాలి. అప్పుడప్పుడూ నాటకాల్లో పాత్రలుకూడా ధరిస్తూ ఉంటాడు— అవి ఎలాటి పాత్రలైనాసరే — ఒకోసారి బంట్రోతు పాత్ర— మరోసారి రాజు పాత్ర, దయ్యంకాని దేవుడుకాని అతనికి తేడాలేదు. ఎప్పుడూ ఏ రసాన్ని ప్రదర్శించడానికైనా సంసిద్ధమే, సుఖంకాని దుఃఖంకాని, కరుణకాని ఆశ్చర్యంకాని— ఎలాటి రసమైనా ప్రదర్శిస్తాడు. కాని హృదయంలో మాత్రం ఎప్పుడూ సాధువే.

అర్ధరాత్రయేసరికి ఇంటికి మళ్ళీ మామూలు ప్రకారం తిరిగివస్తాడు. మళ్ళీ మామూలు మనిషి, మంచి భర్త. మెత్తని ఎదగల తండ్రి, చల్లగా వెళ్ళి భార్య పక్కలో దూరిపోతాడు. ఇంకా అతని కళ్ళముందు ఆ నాటకంలో చూచిన అప్సరసల అమరరూపాలు తళుకొత్తుతూనే ఉంటాయి. అలా అవి ఊహించుకుంటూ కళ్ళు మూస్తాడు. బ్రతుకు ఒళ్లో ఎంత త్వరలో వాలిపోతాడో నిద్ర ఒడిలోకూడా అంత త్వరలోనే వాలిపోతాడు.

ఈ మనిషి ఒక్క మనిషికాదు, ఇతనిలో విషయాలన్నీ ఉన్నాయి. లోకమంతా ఇతనిలోనే ఉందనవచ్చు, చరిత్ర సాహిత్యం, రాజకీయాలు, ప్రభుత్వం, విజ్ఞానంఅన్నీ ఇతనిలో నిలయం చేసుకున్నాయి. ఇతన్ని ఒక సజీవ విజ్ఞాన సర్వస్వమని పిలవవచ్చు. ఎప్పుడూ పారిస్ నగరంలాగానే కదిలి పోయే నిలకడంటూ లేని ఒక ప్రవాహ మనవచ్చు. అతనికి ఒక కాలుకాదు, ఎన్ని కాళ్ళతోనో అక్కడనక ఇక్కడనక నడుస్తూ ఉంటాడు. ముప్ఫయి ఏళ్ళకే ముసలివాడై అతిగా

రోజులు నిశ్చింతగా గడపడానికి బాంకులో కొద్దిడబ్బు. అతనికి

సేవించిన బ్రాందీ పోసిన కడుపుతో కళ్లుమూసే పనివాడు, హాయిగా ఊహాల ఊయలలూగే తత్వవేత్తలు ఈ చిన్న సైజు గుమాస్తాకంటె ఎక్కువ అదృష్టవంతుడని అనుకుంటా రనుకుంటాను. ఒకడవుతే ఒక్క గుక్కలో చనిపోతాడు, మరొకడు మెల్ల మెల్లగా చావు ఒళ్లోకి సాగిపోతాడు. ఎన్నెన్నో రకాల పనులు, బుజాలు, వెన్ను, చేతులు కరిగించే పనులు, భార్య, వ్యాపారం, బిడ్డలు, కొన్ని వేల ఫ్రాంకులు — ఇవన్నీ కలిసి అతనికి ఆనందం అందిస్తాయి. ఈ ఆస్తి ఈ బిడ్డలు అతన్ని మరోమెట్టుపైకి తీసుకునిపోతారు. తన కొడుకుని కూతు రిని కాలేజీకి పంపుతాడు. వారు తండ్రిని మించిన వారవుతారు, వారిచూపు తండ్రిచూపు కంటెకూడా పై చూపు. చివరకు పార్లమెంటు మెంబరయినా కాకపోతానా అని వాంఛిస్తారు.

ఇక పారిస్ నగరంలోని రెండో అంతస్తుకు వెళ్ళి పరి కిద్దాం. మొదటి అంతస్తులోకి వెళ్ళి ఆ పైనవున్న రెండో అంతస్తుకు వెళ్లాలి లేకపోతే పై అంతస్తులోంచి నాలుగో అంతస్తులోనికి వెళ్లాలి. అక్కడ ఎన్నోరకాల చిత్ర విచిత్రాలు కనిపిస్తాయి, కాని అన్నీ ఒకలాటివే. టోకు వ్యాపారస్తులు వారికి సంబంధించిన మనుష్యులు, చిన్న చిన్న బ్యాంకింగ్ ఎకౌంట్ కొద్దిపాటి గౌరవాలు వున్నవాళ్లు — పుండాకోరులు — యిలా ఎందరెందరో కనపిస్తారు. గుమాస్తాలు — పెద్దవారు — చిన్నవారు చాలమంది ఉంటారు. వీరంతా ఆలోచించేవారు, పని చేసేవారు ఊహాలల్లేవారు, పారిస్ మధ్య తరగతికి చెందినవారు. పారిస్ నగరం ధనరాసులు, ధాన్యరాసులు

అన్నీ పోగుచేసేది వీరే. దక్షిణాది ఫలాలన్నిటిని – చాపలు– ద్రాక్షరసం – అన్నిటిని భద్రపరుస్తారు, చక్కని శాలువాలు– మస్లిన్లు కొనడం – అమ్మడం – అన్నీ వీరే చేస్తారు. బిల్లులు, లెక్కలు, సెక్యూరిటీల వసూలు, వీరి చేతిలోనే ఉంటుంది. పిల్లల తాలూకు ఊహలన్నీ వీరే ఊహిస్తారు, వారి ఉబలాటాలకు ఆటబొమ్మలు అందిస్తారు. వీరంతా కూలీల్లా బ్రాందీ సేవించకపోవచ్చు. వేశ్యల ఇండ్లకు వెళ్ళకపోవచ్చు, కాని వీరూ తమ శక్తినీ బలాన్ని వెచ్చిస్తారు, శరీరాన్ని మనస్సు అలమ చేసుకుంటారు. కోరికలు వీరిని అనుక్షణం దహిస్తూనే ఉంటాయి, వీరిలోనూ వేషం ఉంది. ఎన్నెన్నో కోరికలమధ్య ఆశలమధ్య, ఆశయాలమధ్య వీరు నలిగిపోతూంటారు, సుఖం కోసం వీరూ అందనిపరుగులుతీస్తారు. రోజుకు పగలుకాని రాత్రి కాని, నాలుగో ఐదో గంటలు కాలం తీరిక చేసుకుని కాలాన్ని కులాసాల్లో కరిగిస్తారు. ముప్ఫయేళ్ళ వృద్ధాప్యాన్ని రెండు సంవత్సరాల విశ్రాంతి కాలాన్నిముందే కొనుక్కుంటారు. పని వాడు మాత్రం హాస్పిటల్ లో చనిపోతాడు. మధ్యతరగతి వ్యక్తి మాత్రం జీవయాత్ర మెల్లగా సాగిస్తూనే ఉంటాడు. గుడ్డివానిలా బ్రతుకుబాటలో సాగిపోతూనే ఉంటాడు, అతను నీకెప్పుడైనా ఎదురవుతే చూడు – ఎలా కనుపిస్తాడో. వాడిన ముఖం, గాజు కళ్ళు. మైనంలా సాగీ కాళ్ళూ చేతులూ, రోడ్డు మీద నత్తగుల్లలా నడిచివస్తూ ఉంటారు. అదే వేశ్యల వీధి, అతని ప్రియనగరానికి వడ్డాణంలాంటిది. ఇంతకూ అతను కోరే దేమిటి? కొద్దిపాటి భూస్థితి, ఒక చిన్న కొంప, కడపటి రోజులు నిశ్చితంగా గడపడానికి బాంకులో కొద్దిడబ్బు. అతనికి

సోమవారమే ఆదివారం, బొడుగు బండిలో వెళ్ళినప్పుడే అత నికి కొద్ది విరామం. అప్పుడప్పుడూ ఒక బొడుగబండి అద్దెకు పుచ్చుకుని గ్రామసీమకు సెలవు రోజులు గడపడంకోసం భార్యాపిల్లలతో సహా వెడుతూఉంటాడు. అప్పుడు కాని అతని భార్యకాని పిల్లలుకాని వెచ్చని ఎండలో జలకమాడరు, ఒక చిన్న హోటల్‌కు వెడతారు. ఆరోగ్యకరం కాని ఆహారాన్ని అంతా సేవిస్తారు, అప్పుడప్పుడూ ఏ విందుకో వెడుతూ ఉంటాడు. అర్ధరాత్రి దాటేవరకూ అక్కడే గడుపు తాడు. కొందరుంటారు, మతి లేనివారు, మైక్రోస్కోప్‌లో నుంచి నీటిచుక్కను చూచి అందులోని పురుగులను చూచి భయపడిపోతారు. ఈ పారిస్‌కూడా అలాగే కనుపిస్తుంది. ఎక్కడో స్వర్గలోకపు అంచులనుంచి ఊడిపడిన వ్యక్తి ఈ పారిస్ నగరాన్ని చూస్తే ఏమంటాడో చూడండి. ఒక చిన్న ఇల్లు, ఎండల కాలంలోకూడా చల్లగానే ఉంటుంది, ఇక చలి కాలంలోకూడా ఒక్క స్టోల్ మాత్రమే వెలగుతుంది. ప్రొద్దున్నే అమ్మగారు తయారు. ఆవిడ మార్కెట్‌లో ఉద్యోగం చేస్తోంది, సంవత్సరానికి పన్నెండువేల ఫ్రాంకులు సంపాదిస్తుందని అంటారు. అమ్మగారు మార్కెట్‌నుంచి ఇంటికి రాగానే అయ్యగారు మసగ్గా కనుపించే ఆఫీసులోకి వెడతాడు. జిల్లాలోని వ్యాపారస్తులందరికి వారాంతంవరకు డబ్బు అప్పు లిస్తూ ఉంటాడు, తొమ్మిదిగంటలకల్లా పాస్‌పోర్టు ఆఫీసుకు వెడతాడు.

అక్కడ అతనొక చిన్నగుమస్తా. జిల్లాలో వ్యాపారస్థు లకు ఆఫీసుటైము అయ్యేవరకూ డబ్బు పంపిణీ చేస్తాడు. సాయం

కాలం కాగానే థియేటర్ దగ్గర తయారు. పిల్లల్ని నర్సులకు అప్పగిస్తాడు. స్కూలు కాలేజీలు పూర్తి చేసుకున్నాక కాని మళ్ళీఇంటికిరారు. అయ్యగారు అమ్మగారు నివసించేదెక్కడంటారా? మూడో అంతస్తులో. వంటవాడు ఒకడే. అప్పుడప్పుడూ సెలూన్‌కు వెళ్ళి చక్కగా డాన్సుకూడా చేస్తూంటారు. 150 వేలఫ్రాంకులు కుమార్తెకు వరకట్నంగాఇస్తారు' యాభయ్యో ఏట వానప్రస్థం స్వీకరిస్తారు. ఆ వయస్సులో వారు అపెరా బాల్కనీలో తరుచుగా కనిపిస్తూఉంటారు. లేత ఎండలు మిలమిలలాడే చల్లని రోజుల్లో పల్చనిబట్టలుధరించి తోటల్లో హాయిగా షికార్లుచేస్తూ కనుపిస్తారు. తోటివాళ్ళంతా వారిని ఎంతో గౌరవిస్తారు. ఇలా ఉండగా అతనికి అరవైఅయిదవ సంవత్సరం వస్తుంది. ప్రభుత్వం అతనికి పతకంకూడా బహూకరిస్తుంది. కూతురి మామగారిని కూడా మేయర్ పదవిచ్చి గౌరవిస్తుంది. అతన్ని తరుచుగా విందులకు ఆహ్వానిస్తూ ఉంటారు. అయితే ఇలా ఈ బ్రతుకంతా పడినశ్రమలు పిల్లల కోసం ఫలిస్తాయి. ఇలా ఒక అంతస్తు ఎప్పుడూ పైఅంతస్తును చేరుకోడానికి యత్నిస్తుంది. ఒక దుకాణాదారు కొడుకు మెల్లగా ఒక కౌన్సిలర్ అవుతాడు. ఒక కలప వ్యాపారస్తుని కొడుకు ఏ కౌన్సిలరో మరేదో అవుతాడు, ఈ ప్రెన్స్‌లో మధ్యలో ఏలింపూపహ్ము.

ఇలా మనం ఈ నరకంయొక్క మూడో అంతసు చేరుకున్నాం. ఇక్కడ [illegible] ఎప్పుడో ఒకప్పుడు డాంటే కనుపిస్తాడేమో. ఈ మూడో వలయాన్ని ఒకవిధంగా చెప్పాలంటే ఇది పారిస్‌కుగం...లాంటిదనవచ్చు. ఇక్కడే నగరం కోరిక

లన్నీ జీర్ణానికివస్తాయి. వ్యాపారం అనే రూపాంతరాన్ని ఇక్కడే ధరిస్తాయి. ఇక్కడేవలయాలు తిరుగుతాయి. వేగుల గుండా ప్రయాణం చేస్తాయి. లాయర్లు, డాక్టర్లు, పెద్దలు, కౌన్సిలర్లు, వ్యాపారస్తులు, బాంకర్లు, స్పెక్యులేటర్లు— అంతా ఇక్కడే మారు మారు రూపాలు పొందుతారు. ఒకరికోటు ఒకరు వేసుకుంటారు. ఇక్కడే శారీరికంగానూ నైతికంగానూ మనకు పతనం ఎక్కువగా గోచరిస్తుంది. వీరంతాకూడా— ఆరోగ్యానికి ఏమాత్రం ఆస్కారంలేని ఆఫీసుల్లో కాలంగడిపిన వారే. మసకగదుల్లోనూ ఊపిరాడని కొంపల్లోనూ నివసించిన వారే. వ్యవహారాల బరువులు మోస్తూ రోజులువెళ్ళదీసిన వారే. ఉదయం నిద్రలేస్తారు. సకాలానికి ఆఫీసుకు వెళ్ళాలి. వెనకబడకూడదు. క్షణంలో సగంపోయినా రూపాయపోయి నట్టే. అందరికంటె ముందుగా తాము పరుగుతీయాలి. ఒక కొత్త దుకాణం తెరవాలి. లేదా మరోదుకాణం మూయాలి. ఏదో పరుగెత్తికెళ్ళే అవకాశాన్ని అదనుకనిపెట్టి పట్టుకోవాలి. ఎవరో మనిషిని ఇట్టే చూస్తూండగానే మటుమాయం చెయ్యాలి. అంచాత తమ బండ్ల గుర్రాలను మెరుపుల్లా పరువులెత్తిస్తారు. అవి వయస్సుమళ్ళక మునుపే [illegible]లి పోతాయి. కాలం వారిని పాలించే చక్రవర్తి. అది వారికి రిక్త హస్తాలు చూపుతుంది. వారిహస్తాలనుంచి జారుకునిపోతుంది. వారు దాన్ని పొడిగించనూలేరు కత్తిరించనూలేరు. ఇక ఏ ఆత్మకాస ఉన్నతంగానూ ఉదారంగానూ ఉండాలంటే ఎలా సాధ్యం? ఇక ఏ ముఖంలోమాత్రం అందం చిందులాడాలంటే అదెలా సాధ్యం? ఎప్పుడూ ఏవేవో పిలుపుల ఎడ తెరిపి

లేకుండా పిలుస్తున్నప్పుడు ఏ ముఖం మాత్రం నిర్మలంగా ఎలా ఉంటుంది. వీరంతా కూడా తమహృదయాలు ఎక్కడ దాచుకొని ఎలా జీవిస్తారో నేనెలాచెప్పగలను; కాని ప్రతి నిత్యం ప్రతి ఉదయం ఎక్కడో ఒకచోట తమహృదయాలు దాచిపెట్టుకొని అగాధంగా కనిపించి యీలోయలోకి మెల్లిగా జారుకుంటారు. వీరికి అందని రహస్యం అంటూ యేమీలేదు. సంఘం వీరికి తలక్రిందులుగా కనిపిస్తుంది. దాన్ని నిరసిస్తూనే దాంతో తమ ఒప్పందాలు చేసుకుంటారు. అవినీతితోను పతనంతోను ఆ స్వరూపాన్నిచూచి భయంచెందడం ముఖాలు వేల వేసుకోడం లేక రహస్యంగా ఒప్పందాలు చేసుకోవడమో చేస్తారు. దేన్ని నిరసిస్తారో దాన్నే వరిస్తారు. ప్రతిస్పందనకు రానురాను హృదయం ప్రతిస్పందించకుండా గడ్డకట్టుకుపోతుంది. రానురాను మానవుని సంస్థలు చట్టాలు వీరిని నక్కల్లాగ తయారుచేస్తాయి. ఇంకా వెచ్చదనం పూర్తిగా ఆరిపోని శవాలను దొంగిలించుకుని వెళ్లే నక్కల్లాగా తయారవుతారు. అనుక్షణం పెట్టుబడిదారు యీ జీవరాసులపై కాళ్లుంచి కదలిపోతూనేవుంటాడు. మృతులకు యితనేజడ్జి అవుతాడు. అంతరాత్మను యితనే లాయరు. ఇక వీరెలా మాట్లాడతారంటారా? వసపోసినట్లు ఎప్పుడూ మాట్లాడుతూనే వుంటారు. భావాలకు బదులు మాటలేఎక్కువ. వీరి అంతరాత్మ పెద్ద లోయగా మారుతుంది. పెద్ద వర్తకుడుకాని. జడ్జికాని, ప్లీడరుకాని చివర నిజం అంటే యేమిటో తెలుసుకోకుండాపోతాడు. ఇక వీళ్ళరూపం యిది అని మనం స్పష్టంగా చెప్పడానికి వీల్లేదు. ఇక వారి హృదయాలు పూర్తిగా

శూన్యమైపోతాయి. మంచికీ చెడుకీ మధ్యఉన్న రేఖ పూర్తిగా మాసిపోతుంది. ఇలా బాటలో నడచి నడచి వారు ఏమీ కాకుండా పోతారు. భర్తలుకాని తండ్రులుకాని ప్రేమికులు కాని మరేమీకారు. జీవితపు వాస్తవాలపై రబ్బరు టైర్ల బండ్లు వేసుకుని చల్లగా దొర్లిపోతారు. విశాలనగరంలోని వ్యాపారపు ఒత్తిడిలో అనుక్షణం జీవిస్తూఉంటారు. ఇంటికి తిరిగిరాగానే బోర్డాన్సుకో లేక అపెరాకో క్లబ్బుకో వెళ్ళి ముచ్చట్లలో మామూలు జీవితాన్ని మరిచిపోతారు.

ఎప్పుడూ వారిమనోశక్తి ఇలా ధారగా అంతూపొంతూ లేకుండా వెచ్చింపబడుతూనేఉంటుంది. ఎడతెగని నైతిక వైరుధ్యాలమధ్య వారెప్పుడూ నలిగిపోతూనేఉంటారు. ఎప్పుడూ వారు సుఖాన్ని ఆశిస్తూ వెడతారు. కాని దీన్ని సుఖమని పిలవడం కంటె వ్యభిచారమని పిలిస్తే ఎక్కువ ఉచితంగా ఉంటుంది. రహస్యమైన వ్యభిచారం. రంగు రంగుల కలలూ కలవరాలూ దాచుకున్న వ్యభిచారం. ఈ రంగులరాటంలో తిరుగుతూనే సంఘ నీతిని నిర్ణయిస్తారు. వీరి అవివేకతంతా ఈ ప్రత్యేకతం చాటున దాక్కునిఉంది. వారికి వారి వ్యవహారం వ్యాపారం చక్కగానే తెలుసు. కాని దానిచుట్టూఉన్న వలయం మాత్రం వారికి అణుమాత్రంకూడా తెలీదు. ఇలా తమనుతాము కప్పుకున్న మోసపుముసుగును దాచుకోవడం కోసం ప్రతిదాన్ని ప్రశ్నిస్తారు. ప్రతిదాన్ని పరిశోధించి చూచినట్లుగా నటిస్తారు. కాని సంశయాత్మలలాగ పైకికనిపించినప్పటికీ వారు నిజానికి నట్టి అమాయకులనే చెప్పాలి. అర్థంలేని వాదోపవాదాల్లో వారి చలోక్తులన్నీ విసిరేస్తూవుంటారు.

వీరిలో చాలమంది యించుమించుగా అందరూ సాంఘిక రాజకీయ అభిప్రాయాలను తమకు అనుకూలంగా అనువర్తించుకుంటారు. కాని స్పష్టంగా వీరికి ఎలాంటి అభిప్రాయాలు వుండవు. తమఅంతరాత్మను వ్యాపారరీతులకు అనుకూలంగా మార్చుకున్నట్లే యీ అభిప్రాయాలుకూడ వీరిలో మాటిమాటికీ మారుతూవుంటాయి. ప్రసిద్ధులు కావాలనే ఆశతో బయలుదేరి చివరకు ఎందుకూ పనికిరాకుండాపోతారు. లోకంలోని పెద్దపదవులకోసం పాకులాడతారు. వీరి ముఖాలకుకూడా కొత్తరంగు పులుముకుంటారు. రంగుమాసిన గాజుముఖాల్లా కనిపిస్తాయి. గాజుకళ్లు. వీరిగాజుకళ్ళలో ముఖాల్లో పతనమైపోయిన ఆలోచనలతాలూకు ఛాయలన్నీకూడా స్పష్టంగా కనిపిస్తూవుంటాయి. ఆ ఆలోచన ఎప్పుడూ వారిముఖాల్లో ఒకవలయంలా తిరుగుతుంది. వారి మనసులోని స్వజనాత్మక శక్తులన్నీ ఎండగాలికి లతలు వాడిపోయినట్లుగా యీ ఆలోచనలకు వాడిపోతాయి. దూరదృష్టికాని సాధారణీకరణంగాని వీరిలో మచ్చుకుకూడ కనిపించదు. ఈ చక్ర నియమిక్రంలో యిరుక్కుపోయిన యేమనిషి గొప్పవాడుకాలేడు. అతనొకవేళ ఒకడాక్టరు అయ్యాడంటే తను పూర్వం గొప్పప్రాక్టీసున్న డాక్టరో భవిష్యత్తులో ఆశవున్నవాడో అయివుంటాడు. ఒక వర్తకుడయ్యాడంటే దివాలా తీసినవాడవుతాడు. రాబన్ ఫర్రీ ప్రాక్టీసు చేశాడంటూరా? డాంటన్ ఎంతకాలం కనిపెట్టుకువుండలేదు? వీరినిచూచి ఎందరు అసూయపడివుంటారు? కాని యీ మహావ్యక్తులంతా ఎప్పుడూ డబ్బు తమదాపుకు వచ్చేటట్లుగా చూచి తద్వారా అభిజాతకుటుంబాలతో పొత్తు

కలపడానికి చూస్తారు. ఒక చిన్నకూలీ, తను వ్యాపారస్తుడుగా తను మారిపోవాలని యత్నిస్తే దానికికారణంయిదే. పారిస్‌లో అన్ని ఉద్యోగాలు అన్నికోరికలు ఒక్క ఆడంబరంలోనే వున్నాయని చెప్పవచ్చు. ఈ వర్గం చాలచిత్రమైనది. ఎంతో కాలం వంటిగా జీవితంలో చివరకు యే కౌన్సిలర్ ఆఫ్ స్టేట్ లోనో చీమకన్నంలో దూరినట్లు దూరిపోతారు. లేక ఏ న్యూస్‌పేపర్ ఎడిటర్‌గానో మారిపోతారు. పేపర్లలో అర్థం లేని రాతలన్నీ రాస్తూవుంటారు. ఇలా ఆశయాన్ని అందు కున్నవారంతా చివరకు ఆశయంచేత కబళించబడతారు. ఈ వర్గానికి పైగా కళాకారుల ప్రపంచంవుంది. ఇక్కడకూడా వాడిపోయిన ముఖాలు ఎన్నో కనిపిస్తాయి, ఆ ముఖాలు ఉదాత్తంగా కనిపించినప్పటికీ పాలి వాడిపోయి ప్రతిక్షణం చలించి పోతూంటాయి. ఎప్పుడూ యేదో వాక ఉత్పత్తి చేస్తూవుండాలి. ఎప్పుడూ దేనికోసమో దేవులాట, అందీఅందని ఆశలు ఆకాశానికట్టిన ఊయల్లోఊగే ఊహలు తమనే కబళించే ప్రతిభ సుఖంకోసం ఎప్పుడూ ఆకలి! ఇలా భ్రమిస్తూ చలిస్తూ వుంటారు ప్యారిస్‌లోని జనం! తీరికలో పోగొట్టుకున్నదన్నంత అతిగా సృష్టించి లోకాన్ని కీర్తిని ధనాన్ని కళనూ సమన్వయం చేయటానికి వృథాప్రయత్నం చేస్తూంటారు. అసలు కళాకారుని జీవితంలోని తొలిఘట్టం చెప్పాలంటే అతనిచుట్టూ అనుక్షణం అప్పులవాళ్లు మూగుతూనే వుంటారు. అతని అవసరాలే అతనికి అప్పులకు దారి తీస్తాయి. అతని అప్పులు అతన్ని రాత్రి పగలు నిద్రపోకుండా పనిచేస్తాయి- ఎంతో శ్రమించిన తర్వాతనే కొద్దిసుఖం. హాస్యగాడు (విదూషకుడు) అర్ధరాత్రివరకూ

నాటకం వేస్తాడు, ఉదయాన తన పోర్షన్ చదువుకుంటాడు మధ్యాహ్నం రిహార్సలుకు వెడతాడు, శిల్పి ఎప్పుడూ తను చేసే శిల్పం దగ్గరే నిల్చుంటాడు. చిత్రకారుడు ఎప్పుడూ తన చిత్రందగ్గరే కూర్చుంటాడు, జర్నలిస్టు ఎప్పుడూ భావార్ణవంలో కొట్టుకు పోతూంటాడు. యుద్ధంలో సైనికుడిలాగ అతని భావాలు ఎప్పుడూ ముందుకే వెడతాయి, చిత్రకారుడి కళ్లు తన చిత్రాలు గీచి గీచి కాయలు కాచిపోతాయి. పోటీస్పర్ధ అపనింద ఎప్పుడూ ప్రతిభమీద దాడిచేస్తూనే వుంటాయి. కొందరు స్వప్నసీమ అంచులనుంచి జారిపడినవారు వ్యసనపు లోయలో కూలిపోతారు. కొందరు లేత వయసులోనే కళ్ళు మూస్తారు, వారికి భావి వుదయించకముందే దూరమైపోతుంది. వీరిలో కొందరు మాత్రమే అగాధమైన అంతరాత్మలు వున్నవారు — సుందరంగా నిలవగలుగుతారు. అంతేకాక వీరి మనస్సుల్లో పూచే సౌందర్య పరిమళం ఎవరూ ఆస్వాదించలేరు, ఎవరికీ అక్కర్లేదు. కళాకారుడి ముఖం ఎప్పుడూ యేదో అతీతంగా కనిపిస్తుంది సాధారణమైన రేఖకు ఎప్పుడూ దాపున వుండదు. పైనో దిగువనో వుంటుంది, ఇంతకూ వీరందరినీ ఆవహించుకునివుండే శక్తి యేమిటంటారు — కోరిక! పారిస్‌లో ప్రజ్వలించే యీ కోరికకు రెండు నాలుకలుంటాయి. ఒక నాలుక బంగారం — రెండవనాలుక సుఖం, ఇప్పుడు మీకు ఊపిరిసలపడం లేదా? ఇప్పుడు మీకు వాతావరణం కొంచెం నిర్మలంగా వున్నట్లు కనిపించడం లేదా? ఇక్కడ శ్రమలేదు — బాధలేదు. ఆకాశానికి మెట్లు కట్టుకుని వెళ్లే బంగారునిచ్చెన యిక్కడ ఆఖరుమెట్టు చేరుకుంది. పొగలెగసే అధో జగత్తు

చిన్ని దుకాణాలనించి, మరలనించి బయలుదేరే యీ నిచ్చెన యిక్కడ నిర్మలంగా యీ కడసారి మెట్టుతో ఆఖరవుతోంది. మధ్యలో ఎన్నో మెట్లు, బంగారంతో చేసినవి - వరకట్నాలు - వారసత్వాలు. గోతులు పెళ్లిళ్లు యిలా యీ నిచ్చెన అభిజాతం వర్గంవైపు క్రమంగా సాగిపోతుంది. ఇక్కడ విశాలమైన మహా ప్రవాహంగా మారిపోతుంది, కాని పారిస్ నగర భోగభాగ్యాలన్నీ ఆధారపడిన యీ నాలుగు వలయాలను మనం విడిచి వచ్చేముందు మనం వీటికిగల నైతిక కారణాలను విచారించి ఆ తర్వాత శారీరక కారణాలను విచారించడం బాగుంటుంది. అప్పుడుకాని యీ పోర్టరు ముఖంలో, కళాకారుని ముఖంలో, యీ చిన్న దుకాణదారు ముఖంలోయిలా యిన్ని నీడలు ఎందుచేత ఆడుతున్నాయో మనకు బోధపడదు. అప్పుడు కాని పారిషియన్ పరిపాలకులు చల్లగా కళ్లు మూసుకుని సంతృప్తితో సాగనిచ్చి యీ మహత్తర పతనానికి వెనకాల వున్న ప్రభావం మనకు గోచరించదు. చాలవరకు మధ్య తరగతులు నివశించే ఈ చిన్న చిన్న యిండ్లలోని వాతావరణం అసహ్యాకరమయింది ఎప్పుడూ ఏదో పొగలు వగలు. మురికి నిండిన వీధులు. పొగలు నిండిన వంటిళ్లు, ఊపిరాడని వంటగదులు. ఇలా పారిస్ నగరంలోని నలభై వేల ఇండ్లకూ ఈ కశ్మలంలోనే వేళ్లున్నాయని చెప్పవచ్చు. చుట్టూ గోడ లేని ఒక శూన్యనగరంలా కనిపిస్తుంది పారిస్. పారిస్‌లో సగ భాగం ఎప్పుడూ వీధుల్లోనే నిఘరిస్తుంది. ఇక పెద్ద పెద్ద సెల్లూన సంగతి చూదాం. అవీ ఎప్పుడూ క్రిక్కిరిసే ఉంటాయి. తోటల్లో హోటళ్లు. చెదురు చెదురుగా బంగళాలు. ఎప్పుడూ

తిని తాగి కాలాన్ని కాగితంలా కాల్చే సుఖలోకం వినోదంలో విలాసంలో మునిగి తేలుతూవుంటుంది. ప్రతి ముఖంలోనూ ఆడంబరం మబ్బులా ఉబ్బి కనుపిస్తుంది. అక్కడ ఏదీనిజం కాదు. సుఖంకోసం వెదకడమంటే నెత్తురు పాలిపోవడంకోసం వెదకడమన్నమాట. పై స్థాయిలోవారు మొగ్గ వయసులోనే వారి స్వభావాలకు ముసుగులు వేసుకున్నారు. సుఖంలో ఈదులాడడం తప్ప మరో పనీ పాటా లేక వీరు తమ ఇంగిత జ్ఞానాన్ని అపసవ్యంగా వినియోగించుకున్నారు_కూలీ బ్రాందీ పుచ్చుకున్నట్టు. సుఖం కొన్ని మందులలాంటిది. ఎప్పుడూ ఒకే రకమైన ఫలితాలు కావాలంటే డోసులు హెచ్చించి ఇవ్వాలి. ఆఖరకు ఎలాగో వైకుంఠయాత్ర తప్పదు. ఇక కడగొట్టు వర్గాల వారంటారా – వారెప్పుడూ ఉన్నదారిముందు మోకరిల్లుతూనే వుంటారు. వారి అభిరుచులు ఎలా ఎలా వున్నవో ఎలా మార్పు చెందుతున్నవో చూచి వాటిని తమ వ్యసనాల కింద మార్చుకుని ఉపయోగించుకుంటారు. ఈ విధంగా వీరిలో తొలి వయస్సులోనే మనకి తీరని కోరికల తాలూకు అభిరుచులు విచిత్రమైన ఊహాలు నులివెచ్చని ప్రణయాలు మొలకెత్తి కనుపిస్తాయి. వారి... వారిని పాలిస్తుంది, వారిలో భావాలు వాడిపోయాయి. విలాసినుల కులాసాల్లో ఆవిరిగామారి ఆకసంలో కలిశాయి. వీరికోసం ఎన్నో ఆస్పత్రులు, ఎందరో డాక్టర్లు. పారిస్‌లో శ్రీమంతులకే హాస్యంకాని విజ్ఞానంకాని సులువుగా అందుతుంది. వారికే స్వంత అభిప్రాయాలంటూ కూడా వుంటాయి, ఈ లోకంతాలూకు అవకతవకలన్నీ ఆ స్వేచ్ఛలోనే సమన్వయం పొందుతుంది. కాలంకోసం ఎప్పుడూ

పరువులు తీస్తారు, కాలాన్ని నీళ్ళలో పారబోయాలి, శేకపోతే వీరికి ఒక క్షణంకూడా తోచదు. కంటికి నిద్రరాదు, భావాల కోసం ఎలా వెదుకులాడుతారో అనురాగంకోసం కూడా అలాగే అన్వేషిస్తారు. ఆ ముద్దుల్లో ఒక నిర్లక్ష్యం ఎప్పుడూ అంతర్నిహితంగా దాగివుంటుంది, ఆ కౌగిలిలో ఎప్పుడూ ఏదో నిరాశ సెలవేస్తుంది. అలాటిదే ఆ ప్రేమ, ఎండిన ఎండుటాకుల గల గలలు ఆ గుస గుసల్లో వినిపిస్తాయి. లోతులేని పరాచికాలు లోతులేని వాగునీళ్ళ గల గలల్లా వినిపిస్తాయి. అపనిందలు ఆందోళనలు ఎంతో చౌకబారుగా చలామణీ అవుతాయి. ఇదీ దాని తరహా, కాని సుఖలాలసులైన ఈ అదృష్టవంతులులా రాషెఫకల్‌లాగా చలోక్తు లాడాలని ఎన్నడూ అనుకోరు. వారి చలోక్తుల చాటునున్న అర్థం వారికే తెలీదు. ఇక ఎవరైనా శీలంగలవారు సున్నిత మనస్సులు గలవారు ఏదైనా సున్నితమైని చలోక్తి విసిరితే అది ఎవరికీ బోధపడదు. ఆకాశ కుసుమంలా కనుపిస్తుంది, ఇక ఇవ్వడంతో పూర్తిగా విరక్తి చెందుతారు. ఇవ్వడమే కాని పుచ్చుకోడమనేది ఎన్నడూ లేదు. ఇక చివరకు అలసిపోయి ఇళ్లకు చేరుకుంటారు. గూళ్ళకు చేరుకున్న పక్షుల్లా అక్కడే వుండిపోతారు, ఇక ఎవరిదారిన వారు పోతారని ఊరుకుంటారు. ఈ డొల్ల బ్రతుకు – రాసిసుఖపు వానకోసం ఎదురుచూపు – ఈ శూన్య సంగీతం – ఇదే పారిషియన్ ప్రపంచపు ఉపరితలం. ఇదే ప్రతి ముఖంలోనూ తన ముద్ర లిఖించుకునిపోతుంది, వయస్సు రాక మునుపే వాడిన ముఖాలు కనుపిస్తాయి. ఆ ముఖాలు అద్దాల్లా కనుపిస్తాయి. ఆ అద్దాల్లో బంగారపు తళుకు మిల మిల లాడు

తుంది. ఆ అద్దాలనుంచి తెలివి తొలిగిపోయింది. శూన్యంగా చూచే అద్దాలు.

ఇదే పారిస్ నైతికవదనం, పారిస్ శరీర రూపం. ఈ నగరాన్ని ఒక రాణీతో పోల్చవచ్చు. ఆ రాణీ ఎప్పుడూ పసిపిల్ల. కాని ఎడతెగని కోరికలు, ఎంతకూ తీరని కోరికలు. లోకానికి మకుటం పారిస్, ప్రతిభ అనే క్షయవ్యాధితో నశించిపోయే బుర్ర. మానవ నాగరికతను ముందుకు లాక్కుని వెళ్ళే మార్గదర్శి. ఆ నగరం ఒక మహావ్యక్తి, ఒక సృజనాత్మక కళామూర్తి. మనోనేత్రం తెరచుకున్న రాజకీయవాది, అంచాతనే ఆ నుదుటిపై అలా ముడతలు. ఒక మహావ్యక్తి వ్యసనుల తాలూకు మరకలవి. ఒక భావుకుని లతల సాగిన ఊహాలు. పేక మేడలల్లే కూలిన రాజకీయవాద స్వప్న భవనాలు. ఈ శరీర రూపంలోనుంచీ చెడూ — ఈ రెండింటి పరిణామక్రమం కనుపిస్తుంది. ఇది పద్ధెనిమిదవ శతాబ్దపు పిలుపు. నేటికీ లోకం ప్రతిమూాల మారుమ్రోగుతూనే ఉంది, 1814 పతనంకూడా ఈ పిలుపులోనే వినవస్తూంది. ఇక ఈ నగరం నీతిగా ఉంటుందంటే, నిర్మలంగా ఉంటుందంటే, పరువుగా ఉంటుందంటే అది కల్ల. పారిస్ నగరం ఒక పెద్ద పడవ కాదూ? మేధస్సును మోసుకుని వెళ్ళే పడవ. అవును ఆవిడ హస్తాలు ఎంత విశాలమైనవి. పారిస్ నగరదేవత తన తెరచాప లాగానే ఎన్నెన్ని విజయాలతో మురిసిపోతూంది! ఎన్ని అలలు అటూ ఇటూ ఊగిసలాడచేసినా ఈ పడవ అలాగే సాగిపోతుంది. లోకాన్ని కోటి దీపాలతో వెలిగిస్తుంది, సాగరాలను దున్ని రత్నాలరాసులు వెలికి తీస్తుంది. తెరచుకున్న

తెరచాపతో హాయిగా సాగిపోతుంది. ఆ కొసల్లో కళాకారులూ శాస్త్రవేత్తలూ నిల్చుని, 'ముందుకు, ఇంకా ముందుకు' అని తమగానం సాగిస్తారు. ఈ పడవలో ఎందరెందరో ప్రయాణికులు, వెనకాల మరెన్నో పడవలబారులు. కొత్త కొత్త స్త్రీ మగ్గు, పిల్లల కిల కిల నవ్వులు, నావికులు, పెద్దలుచిన్నలు, స్త్రీలు పురుషులు, — పండుగలా సాగిపోతుంది.

ఇలా శ్రామికుల అనంత ప్రవాహవేగం, ఇరు మధ్య తరగతుల పతనం, కళాకారుని స్వప్నాలు, పెద్దల సుఖాలాలసతా — అన్నికలిసి పారిస్ శరీరంగా రూపం తాల్చాయి. ఒక్క ప్రాచ్యదేశాల్లో మాత్రమే మానవజాతి మహనీయత ఉంది. కాని దానికి కారణం అక్కడి తాత్వికుల కొద్దిపాటి కాళ్లూ, పొడుగైన పైపులు — వారికి కదలికంటే తగని రోత. కాని పారిస్‌లో మాత్రం పెద్దా చిన్నా మధ్యరకం — అంతా లేడిపిల్లల్లా గెంతులువేస్తూ పోతారు. అవసరమనే దేవత వారిని ఎప్పుడూ అలా చులాగ్గా ఆడిస్తూ తీసుకుని వెడుతుంది. డబ్బు, కీర్తి — అంతకంటె ఆనందం అవసరం. అందువల్ల ఎక్కడ కాని, నిర్మలంగా స్వచ్ఛంగా, అందంగా యౌవనం తొణికిసలాడే ముఖం మనకి కనుపించిందంటే — ఒక అద్భుతమనే చెప్పాలి. ఎక్కడో కాని అలాటి పూరెమ్మలాంటి ముఖం కనుపించదు. ఒకవేళ ఎన్నడైనా ఎక్కడైనా అలాటి ముఖం మనకి కనుపిస్తే అది ఏ కుర్రవాడయిన మతగురువు ముఖమో అయిఉంటుంది, లేక ఏ పాపం అంటని ఏ కన్నెపిల్ల ముఖమో అయిఉంటుంది. ఇలాటి కన్నెపిల్లలయినా మధ్య తరగతి కుటుంబాల్లోకాని మనకి కనుపించరు. లేక కళ్ళలో

కలలింకా ఆరిపోని ఏ ఇరవై ఏళ్ళ తల్లి ముఖమో ఏ కన్నతల్లి ముఖమో అయివుంటుంది. అప్పుడే కొత్తగా నగరంలో కాలూనిన పల్లెటూరి అమాయకుని ముఖమో మరి. అతను ఎవరో శ్రద్ధాపరురాలైన విధవరాలి విపంచన హాయిగా నిమరించేవాడయి ఉంటాడు. లేక ఏ అర్ధరాత్రికో వెళ్ళి నిదురించి ఏడు గంటలకే మేలుకుని కిటికి తలుపులు తెరిచే ఏ షాప్ ఎసిస్టెంట్‌దో అయివుంటుంది. లేక ఏ శాస్త్రవేత్త ముఖమో, ఎప్పుడూ ఏదో తీయని స్వప్నపు కౌగిట్లో వాడిపోని పూవులా పవళించే కవి ముఖమో అయివుంటుంది. లేక ఏ క్షణమూ అసంతృప్తి ఎరగని ఆనందం చెదరని, తన అవ్యక్తమైన అసత్యాన్ని తనే భుజిస్తూ వాడిపోతూ తన చిరునవ్వును తను ధ్యానిస్తూ కాలం వెళ్ళదీసే అవివేకి ముఖమో అయివుంటుంది. లేక పారిస్ వీధుల్లో పనితోచక మెల్లగా చల్లగా నడిచివెళ్ళే వారి ముఖమై వుంటుంది.

ఏది ఎలా వున్నా, పారిస్‌లో అనుక్షణం శరవేగంతో సాగిపోయే పరిశ్రమలవల్ల, వ్యవహారాలవల్ల, కళలవల్ల, బంగారంవల్ల లాభం పొందినవారు లేకపోలేదు. వీరెవరంటే స్త్రీలు. వీరికి శారీరిక రూపాలు విచలితం కావించే కారణాలు అనేకం వున్నా, ఈ స్త్రీ లోకంలో కొన్ని సుఖాల దీవులు అక్కడక్కడ ఎదురుచెదురుగా కనుపించకపోవు. వీరు ప్రాచ్య పద్ధతుల్లో జీవించే స్త్రీలు. శరీర సౌందర్యాన్ని చక్కగా కాపాడుకుంటారు. కాని ఇలాటివారు ఎప్పుడో కాని వీధుల్లో కాలినడకన ప్రత్యక్ష్యం కారు. ఏ కొద్దిక్షణాల్లో మాత్రమే తమ రేకులు విప్పారచేసే అందని పూలమొక్కల్లాగ ఎక్కడో

దాగివుంటారు. ఏమైనా పారిస్ నగరం వైరుధ్యాలకు నిలయం. ఒకదానిలో ఒకటి కనుపించదు, అసలైన హృదయస్పందనలు అక్కడ కనుపించకపోవు. అన్నిచోట్లలాగానే అక్కడకూడా ఎక్కడో చెదురు చెదురుగా కనిపిస్తాయి. అక్కడా ఉదాత్తమైన స్నేహాలా, తెంచరాని బంధాలా లేకపోలేదు. తీరని కోరికలు అనుక్షణం కత్తిసాము చేసే ఈ సమరక్షోణిలో ఇహానికితప్ప మరి దేనికీ చోటులేని ఆ సమాజాల్లో లాగానే హృదయస్పందనలు అప్పుడప్పుడూ మిణుగురు పురుగుల్లా తొంగిచూచి ఇట్టే మాయమైపోతాయి. ముఖాలుకూడా ఇంతే, పారిస్‌లో నక్షత్రలోకంలా కనుపించే అభిజాతవర్గంలో వెర్రెత్తించే యువకుల ముఖాలు మనకు అప్పుడప్పుడు ఇలా కనుపిస్తాయి, వీరిలో మనకు ఎంతో మర్యాద మెలకువ కనుపిస్తుంది. ఇంగ్లీషు యువక సౌందర్యానికి ఒక కొత్తదనాన్ని వీరు అందించినట్లుంటారు. కళ్లలో కాంతి, పెదవులపై ఎప్పుడూ తీయని ఒక వికాసం, తెల్లని తేజస్సు, విస్పష్టంగా కనుపించే వీరు — మానవజాతి పూచిన పూవుల్లా కనుపిస్తారు. స్త్రీలు కూడా వీరిని ఎంతో ఆతురతతో కళ్ళు ఇంతలు చేసుకుని చూస్తారు — శోభ, సౌందర్యం, లాలిత్యం, కన్నెతనపు అందచందాలన్నీ పుణికిపుచ్చుకున్న ఒక చక్కని ముత్యంలాటి పిల్లని పురుషులు చూచినట్టు. ఒకమాటు మనం పారిస్ నగరాన్ని ఇలా మెరుపుతీగలా అవలోకించాం. ఈ అవలోకన ఫలిస్తే మన చరిత్రను న్యాయం జరిగినట్టే.

ఒకనాటి చల్లని ఉదయం, అప్పుడే తొలిసంజ విచ్చుకుంటూ వుంది. పాలపుంత ఇంకా పూర్తిగా పాలిపోలేదు,

విచ్చుకున్న ఆకులు ఇంకా ఆకుపచ్చని రంగు తొడగలేదు. అప్పుడే సూర్యుడు ఉదయించాడు, చూరులకు జలతారు రాస్తున్నాడు. ఆకాశం నీలిమ వహిస్తూంది, పారిస్ నగర ప్రజ అప్పుడే పుట్టనుంచి చీమలబారులా బయలుదేరి వీధుల్లోకి వస్తూంది. ఒక పొడవైన సరీసృపంలా పారిస్ ప్రజ రూడి లాపానుంచి టులరీవైపుకు సాగిపోతూవుంది.

ఇలాటి దినాలలో ఒకనాటి చల్లని వుదయం, ఆ ఉదయం లాగానే అందమైన కుర్రాడొకడు పూవులు ముస్తాబై గాలికి అల్లలాడుతున్నట్టు నడుస్తూ వస్తున్నాడు. అతని నడక తీరు చూస్తే అతనొక ప్రేమచకోరాల సంతానమని తెలుస్తూవుంది, లార్డ్ డడ్లీ, మార్కిస్‌డి వార్డాక్‌ల సహజసంతానం ఆ కుర్రాడు. ఈ అందగాని పేరు హెన్రి. పుట్టింది ఫ్రాన్స్‌లో. అప్పుడే లార్డ్ డడ్లీ ఆ అందగత్తెను పెండ్లాడాడు, అప్పటికే ఆవిడ హెన్రీకి తల్లి. యమ్. డి. మారెస్ అనే ఒక వృద్ధునితో ఆవిడకు అంతకుమునుపే సంబంధం వుంటూ వచ్చేది. అప్పటికే ఇంచుమించు పూర్తిగా వాడిపోయిన ఈ సీతాకోక చిలుక — ఈ పుత్రుణ్ణి తన పుత్రునిగా అంగీకరించాడు. 100 వేల ఫ్రాంకుల ఫండుకోసం, అది లార్డ్ డడ్లీకి అంత భారంగాకూడా తోచలేదు. ఆ రోజుల్లో ఫ్రెంచి డబ్బు అంత చౌకగా వుండేది. ఇలా తన భార్య ఫలానాఅని తెలీకుండానే ఆ వృద్ధుడు స్వర్గస్థుడయ్యాడు. ఆ తరువాత కుదాకుడి మార్సె మార్కిస్‌డి కార్డాడ్‌ను పెళ్ళాడింది. కాని మార్కిసీ కాక మునుపు తన కొడుకుపట్ల లార్డ్ డడ్లీపట్ల కొద్దిపాటి ఆందోళన మాత్రమే ప్రకటించింది. అసలు కథ మొదలెట్టి చెప్పాలంటే

ఫ్రాంసుకు ఇంగ్లండుకు యుద్ధం ప్రారంభం కావడమే ఈ ప్రేమ విడదీసిందని చెప్పవచ్చు. ఇహ విశ్వాసము నేది పవిత్రత నేది పారిస్‌లో అసలు భాష నేకాదు. అదీకాక ఒక స్త్రీ జీవితంలో చేకూరిన విజయం, అందచందాలు, ఆకర్షణలు, అంతా అందించే పొగడ్తలు పారిస్ వనితలోని మాతృత్వాన్ని పూర్తిగా మార్పుకావిస్తాయి. లార్డ్ డడ్లీ తన సంతానంపట్ల ఎంత అశ్రద్ధను చూపుతూ వచ్చాడో ఆ తల్లికూడా ఆ సంతానంపట్ల వర్తిస్తూ వచ్చింది. ఆవిడకుకూడా అతని విషయం పట్ల లేదు. తను ఎంతో ఆప్యాయంగా ప్రేమిస్తూవచ్చిన ఆ యువతి అతివేగపూరితమైన చాంచల్యం ఇక ఆవిడలోని మంచి చెడ్డలను చూచే శక్తికూడా అతనిలో పూర్తిగా నశించేలా చేసింది. ఆవిడ సంతానం ఎలాంటిదయినా అతనికి ఒకటే నని పించింది, ఆవిడను గురించిన శ్రద్ధే కాని ఆవిడ సంతానంపై ఆసక్తి ఆవగింజంతయినా వుండదు. అదీకాక తండ్రులలో సహజంగా మరో విచిత్రమైన స్వభావంకూడా వున్నది, తమకు ఎంతో పరిచయంగల సంతానాన్ని మాత్రమే తండ్రులు ప్రేమించగలుగుతారు. సాధారణంగా సంతానంపై తండ్రుల వంటి తల్లులకు మక్కువ ఎక్కువగా వుంటుందనికూడా ఒక ప్రతీతి వుంది.

పాపం హెన్రీ డిమార్సె తన తండ్రిని ఎరగడు. అతను ఎరిగిన తండ్రి అతనికి తండ్రికాదు. అంచాత యమ్. డి. మార్సెయొక్క పితృత్వం సహజంగా అసంపూర్ణమైనదనే చెప్పాలి. సహజంగా చూస్తే కొద్దిక్షణాల్లో మాత్రమే పిల్లలు తండ్రులను గుర్తించడం జరుగుతూ వుంటుంది. యమ్. డి.

మార్సె ఈ సహజప్రకృతినే అనుసరించాడు. అతనికి వ్యసనాలంటూ లేకుండా వున్నట్లవుతే అతను తన పేరు ప్రతిష్ఠలను అలా వెచ్చించకుండా వుండేవాడే. ఈ విధంగా అతను ఏమాత్రం ముందూ వెనుక ఆలోచన లేకుండా తన డబ్బంతా జూదాలకోసం వెదజల్లాడు. నేషనల్ బాంకు ఇచ్చిన డివెడెండ్లు పానశాలల్లో ఖర్చుచేశాడు. తరువాత ఈ శిశువును డిమాసలె డిమార్సె అనే వృద్ధ అక్కగారికి ఇచ్చాడు. ఆవిడ ఈ బిడ్డను ఎంతో శ్రద్ధతో పెంచింది. తన అన్న తనకిచ్చే కొద్దిమొత్తంలోనే ఈ బిడ్డకు అవసరమైన మంచి చెడ్డలన్నీ భద్రంగా చూస్తూవచ్చేది. ఒక్క ఫార్తింగ్‌కూడా జీతం లేకుండా ఏర్పాటు చేశింది, ఆ ట్యూటర్ కీ బిడమీద మక్కువ కలిగి ఆ బిడ్డ సంరక్షణార్థం తన డబ్బులోనే కొంత ఇవ్వడానికి ఒప్పుకున్నాడు. ఆ ట్యూటర్ ఒక రూబీ. మంచి మతగురువు. పది సంవత్సరాలలో కాలేజీలో నేర్చుకునే విద్యను మూడు సంవత్సరాలలోనే ఆ బిడ్డకు నేర్పాడు. తరువాత ఆ బీడి మారినస్ అనే పేరుగల ఆ మహావ్యక్తి ఆ కుర్రాడికి నాగరికతను గూర్చిన అన్ని విషయాలూ నేర్పి ఆ కుర్రాడి చదువు పూర్తిచేశాడు. తను గడించిన అనుభవాన్నంతా ఆ కుర్రాడికి అందచేశాడు. ఆ సమయంలో థియేటర్ల వెనకాలున్న దృశ్యాలను వేశ్యల ఇండ్లకు తరుచుగా తీసుకుని వెళ్లిచూపుతూ వచ్చేవాడు. ఒక్కొకటీ మానవోద్వేగాలను అతనికి ప్రదర్శించి చూపాడు, డ్రాయింగ్ రూముల్లోని రాజకీయాలను అతనికి నేర్పాడు. ఆ రోజుల్లో డ్రాయింగ్ రూముల్లో రాజకీయాలు రెప రెప లాడుతూ వచ్చాయి. ప్రభుత్వ యంత్రం ఎలా పని

చేస్తుందో వివరించి చెప్పాడు. లలితమైన ప్రకృతిపట్ల ఆకర్షణ చూపాడు, తల్లి ప్రేమ ఎరగని ఆ బిడ్డ మనసులో. ఆ శూన్యాన్ని నింపే సున్నితమైన అందాన్ని చూపాడు. చర్చి అంటే అనాథులందరికీ తల్లి లాంటిదేకదూ. ఇలా ఆ కుర్రాడు అంత శ్రద్ధగానూ పెరిగాడు, ఇంతలో ఆ మతగురువు 1812లో కాలం చేశాడు. నలభై ఏళ్ళ మనిషికంటెకూడా ఎక్కువ పరిపక్వత చెందిన కుర్రాణ్ణి తను ఈ లోకంలో వదిలివెడుతున్నాను కదా అనే సంతృప్తితో కళ్ళుమూశాడు. స్వర్గకన్యల శరీరాల్లాగా తీర్చిదిద్దినట్టున్న ఆ సోయగం వెనకాల కంచుతో చేసినంత హృదయమూ మనస్సూ వున్నవని ఎవరు మాత్రం ఎలా గ్రహించగలరు? అంతేకాదు సాధుస్వభావంగల ఆ మతగురువు ఆ అబ్బాయికి వుత్తమమైన పారిస్ సమాజంలో కొన్ని పరిచయాలు స్నేహాలు ఏర్పరిచారు. అది చాలు ఆ కుర్రాడికి, కలిసివచ్చిన మరో భాగ్యంలాంటిదే అది. కొద్ది చెప్పాలంటే ఈ మతగురువు చాలా విచిత్రమైన వ్యక్తి. కుచ్ఛితుడే కాని చాలా మర్యాదస్తుడు, సంశయాత్మకాని అన్ని విషయాలూ బాగా తెలిసినవాడు. చూపులకు బలహీనంగా కనుపిస్తున్నా శారీరికంగానూ మానసికంగానూ ఎంతో బలం గలవారు. అన్ని విషయాలనూ సరిగా తూచి చెప్పగలిగినవాడు, అందరితోనూ సరదాగా మాట్లాడుతాడు. ఇతనివల్ల ఆ కుర్రాడు పొందిన లాభాలు ఇన్నీ అన్నీ అని చెప్పడానికి వీల్లేదు.

అంతర్జాతీయ సమరం కారణంగా కుర్రవాడయిన డిమార్సెకు తన తండ్రి ఎవరో తెలియకుండాపోయింది. అతని పేర

యినా అతనికి తెలుసో తెలీదో అనుమానించదగిన విషయమే. ఇలా అనాథుడైన ఆ కుర్రాడు మదాకుడిమర్సెనుకూడా అపరిచితుడే అయినాడు. అంచాత తన కొత్త తండ్రికికూడా దూరంగానే ఉంటూవచ్చాడు. ఇక అతనికి ఉన్న తల్లి ఒక్కతే కాబట్టి మదాకుడిమర్సెకోసం పెరిలాఛేజ్‌లో ఆవిడ చనిపోయినప్పుడు ఒక చక్కని చిన్న శిలాశిల్పాన్ని కట్టించాడు. మాన్షియర్ డి మరోనిస్ ఈ వృద్ధురాలు చనిపోయిన తరువాత స్వర్గంలో ఉచిత స్థానాన్ని తప్పకుండా చేరుకుంటుందని చెబుతూ వచ్చేవాడు. అంచాత ఆవిడ, హాయిగా చనిపోవడం చూస్తూ హెన్రీ కన్నీళ్ళు రాల్చకపోలేదు. కాని ఆ కన్నీళ్లు మాత్రం తనకోసం రాల్చినవే. ఇలా తన శిష్యుడి దుఃఖాన్ని చూచి మాచీ అతని కన్నీరు తుడిచాడు. ఆవిడ లోకంనుంచి వెళ్లవలసిన సమయం ఆ సన్నమయ్యే పోయిందనీ, ఇటీవల రోజుల్లో ముక్కుపొడుంకూడా సరిగా పీల్చుకోలేకపోయిందని, కంటిచూపు, వినికిడికూడా తరిగిపోయాయని అంచాత ఆవిడ అలా వెళ్ళిపోయినందుకు చింతించవలసిన అగత్యం ఆట్టే లేదని అనునయింపసాగాడు. 1811 లో తన శిష్యుడికి గురుకులంనుంచి విడుదల చేశాడు. ఆ తరువాత యమ్. డి. మర్సె తల్లి మళ్ళీ పెళ్ళాడేలోగానే ఆ మతగురువు ఒక నమ్మకస్థుణ్ణి ఎన్నుకుని ఆ కుర్రాడి ఆస్తిపాస్తులన్నీ భద్రంగా కాపాడడం కోసం నియోగించాడు.

1814 వ సంవత్సరం వచ్చేసరికి హెన్రీ డిమర్సె ఈ లోకంలో ఎలాటి బాధ్యతలూ ఎరగక ఒక స్వేచ్ఛా విహంగంలా ఎగిరిపోతున్నాడు. అతనికి ఇరవైరెండు సంవత్సరాలు

వయసున్నా పదిహేను పదహారేళ్ళ కుర్రాడిలా కనుపిస్తు న్నాడు. అతనితో స్పర్థ ఉన్నవారుకూడా పారిస్‌లో అంత అందగాడయిన యువకుడు లేడని అనేవారు. అతని తండ్రి లార్డ్ డడ్లీనుంచి అతనికి వచ్చిన ఆస్తిలో అతని నీలాల కళ్ళు ఒకటి. తల్లి అందాన్నంతా తనే పుణికి పుచ్చుకున్నాడు. ఇరు వైపులా స్వచ్ఛమైన రక్తం. అంచాత ఒక కన్నెపిల్ల శరీరంలా రెమ్మలాటి శరీరం, స్నిగ్ధమైన ముఖం. సుకుమారమైన మూర్తి చక్కని చేతులు – అతన్ని చూచీ చూడచాలు ఏ స్త్రీ ఐనా ఇట్టే మూర్ఛపోతుంది. హృదయాన్ని తినేశే కోరికలన్నీ తీగలు సాగి ఇట్టే మొలకెత్తుతాయి. తీరే అవకాశాలు లేక మరుపులో మాసిన కోరికలన్నీ మళ్ళీ తళ తళ లాడుతూ తలు కొత్తుతాయి. పారిస్ నగరస్త్రీలు సహజంగా అంత పట్టుగల స్త్రీలు కారు.

సన్నని సెలయేరల్లే సాగిపోతున్న ఈ కుర్రవాని వెన కాల నిర్మలమైన జలాల్లా కనుపించే అతని కండ్లచాటున – హెన్రీకి సింహానికి ఉన్నంతధైర్యమూ కోతికున్నంత చలాకీ ఉండేది. ఒకబంతిని కత్తిమొనతో ఇట్టే కోసేసేవాడు. మెరుపు తీగలా గుర్రపుస్వారీ చేసేవాడు. నాలుగు గుర్రాలబగ్గీని ఎంతో చక్కగా తోలేవాడు. లేడిపిల్లలా గెంతేవాడు. ఆట పాటల్లోకూడా ఆరితేరాడు. అతను పియానో వాయించేతీరు చూచి అతన్ని ఒకగొప్పగాయకుడని అనుకునేవారు. చక్కని గొంతుక. ఆ గొంతుకతో పాడితే ఒక మాసానికి ఎంతయినా సంపాదించిఉండగలిగేవాడే. అయినా– ఇన్ని చక్కని లక్ష ణాలు, అందమైన లోపాలు– ఇన్ని అతనిలోఉన్నా, అన్నీ

ఒక్క వ్యసనంలో మరుగుపడిపోయాయి. అతనికి స్త్రీలో కాని పురుషునిలోకాని నమ్మకం ఉండేదికాదు. దెయ్యం లోనూ నమ్మేవాడుకాదు. దేవునిలోనూ నమ్మేవాడుకాదు. చపలబుద్ధి అతనికి ఒక అందంగా పూర్తిగా తయారైంది.

ఈ విషయాన్ని సుబోధకంగా చెప్పాలంటే ఇలాటి సుకుమారులను సృష్టించిన స్త్రీలను లార్డ్ డడ్లీ ఎందరినో ఎరుగును. అతను ఇలాటి అద్భుతమైన మరొకటికూడా కన్నాడు. యుఫీమి అనే ఒక ఆడపిల్ల ఒక స్పానిష్‌యువతి ద్వారా కలిగింది. హవానాలో పెరిగింది. ఒక యాంటిలి స్త్రీతో కలిసి మాడ్రిడ్ చేరుకుంది. వలసదేశాల తాలూకు అభిరుచులన్నీ ఆ అమ్మాయికిఅలవడ్డాయి. కానిఅదృష్టవశాత్తు ఒక వృద్ధుడూ అధిక శ్రీమంతుడు అయిన ఒక స్పానిష్‌యన్ని పెళ్ళాడింది. అతనిపేరు డాన్‌హిచోమార్కిస్ డిసాన్‌రీర్. ఫ్రెంచి సేనలు స్పెయిన్ ఆక్రమించినప్పటినుంచి అతను పారిస్ లోనే నివసిస్తున్నాడు. రూసెయింట్ లాజరెలో నివసిస్తు న్నాడు, ఒక విధమైన నిర్లక్ష్యంవల్లకాని, పసితనంలోని అమాయకత పట్లగల గౌరవంవల్లకాని లార్డ్‌డడ్లీకి తనపిల్లల కోసం అన్ని దేశాల్లోనూ తను ఏర్పరిచిఉంచిన సంబంధాలను గురించి చెప్పే అలవాటులేదు. ఇది ఒకవిధంగా చూస్తే నాగరికతయొక్క ఒక పొందికలేని రూపమనేఅనాలి. ఇందులో చాలా అవకాశాలున్నాయి. లాభాలదృష్ట్యాచూచి మనం ఇందులోని లోపాలు మరవడం మంచిది. కొద్దిలో ఈ కథ ముగింపుచెయ్యాలంటే, 1816 లో పారిస్ వచ్చాడు. ఒక ఆంగ్లేయ తీర్పునుంచి తప్పుకుని తలదాచుకోడానికి వచ్చాడు.

అప్పుడు అతను హెన్రీని చూడగానే అందగాడైన ఆ కుర్రవా డెవరని ప్రశ్నించాడు. అతనిపేరు వినీవినగానే 'నా అబ్బాయే! ఏంచిత్రం!' అన్నాడు.

ఇదీ 1815 ఏప్రిల్ మాసం మధ్యలో టులరీ బాటవెంట ఏమీ తోచనివాడిలా నడిచిపోతున్న యువకుని కథ. తమ స్వశక్తి తమకు తెలిసినవారిలాగా ఎంతో నిండుగానూ నింపాది గానూ నడిచి వెడుతున్నాడా కుర్రాడు. మధ్య వయస్సులో ఉన్న స్త్రీలు అమాయకంగా అతనివంక చూడడానికి తిరిగి చూస్తున్నారు. ఇతర స్త్రీలు అలా చెయ్యక అతనికోసం కాచుకుని నిల్చుని అతను అలా నడిచిపోగానే అతని రూపాన్ని తమ మనస్సుల్లో పదిలం చేసుకుంటున్నారు, పూవులా పరి మళం ఈనుతున్న ఆ ముఖాన్ని అదనైన కాలంలో జ్ఞప్తికి తెచ్చుకోవచ్చు.

'ఇక్కడేం చేస్తున్నావు ఈ ఆదివారంనాడు?' _ అని అడిగాడు మార్కిస్‌డి రోన్‌కెరోలా తన ప్రక్కగా నడిచి వెడుతున్న హెన్రీని చూచి.

'వలలో ఒక చేప పడింది' అని జవాబు చెప్పాడు ఆ కుర్రాడు.

ఈ భావాల మార్పిడి రెండు అర్థపూరితమైన దృష్టిల ద్వారా సార్థకత చెందింది. డిరోన్‌కెరోలాకు కాని డిమా ర్సెకు కాని ఈ విషయం తెలీదు. ఆ కుర్రవాడు ప్రక్కనే వెడుతున్నవారిని పారిస్ వాసికి సహజమైన నిశితత్వంతో గమ నిస్తూనే ఉన్నాడు. పారిస్ నివాసి చెవికన్ను అంత నిశి

మైనవి. మొదట్లో ఏదీ చూడనట్లూ విననట్లూ కనుపించినా అన్నీ చూస్తూ వింటూనే ఉంటాడు.

ఆ సమయంలో ఒక యువకుడు అతని దగ్గరకు వచ్చి పరిచితంగా అతని చెయ్యి పుచ్చుకుని, 'ఎలా ఉన్నారోయ్ డిమర్నె—?' అని అడిగాడు.

'చాలా కులాసాగా ఉన్నాను' అన్నాడు డిమర్నె పారిస్ యువకుల్లో పైకి సహజంగా కనుపించే ఆప్యాయతతో.

పారిస్ యువకులకు ఇతర నగరాల యువకులకు ఎలాటి పోలికా కనుపించదు. వీరిని రెండు తరగతులుగా విభజించ వచ్చు. కొంత ఉన్న యువకుడొకడు, ఏమీ లేని యువకుడు మరొకడు, ఆలోచించే యువకుడొకడు, ఖర్చు చేసే యువకు డొకడు. కాని ఈ సందర్భంలో మరో విషయంకూడా చెప్పాలి. ఇది ఈ పారిస్‌నగర యువకులకు మాత్రమే సంబంధించిన విష యం. పారిస్‌లో అందమైన జీవితాన్ని హాయిగా గడిపే యువ కులకు మాత్రమే సంబంధించినదీ విషయం. ఇక్కడ ఇతర విధాలైన యువకులుకూడా అనేకమంది ఉంటారు. వీరు పారిషి యన్ జీవితాన్ని అంత త్వరలో అన్వయించుకున్నవారు కాదు. దానికి నకళ్లు మాత్రమే వీరు. వీరు ఊహించరు.

మరికొందరు యువకులు కనుపిస్తారు. వీరు పేదవారు కాని శ్రీమంతులుకాని వివిధరకాలైన వృత్తులను అవలం బిస్తారు. ఏబాటలో అడుగుపెడతారో ఆ బాటలోనే నడిచి పోతారు. ఎమెలీలాంటివారువీరు. సంఘంలో ఎక్కడా వీరు మనకి కనుపించరు. కొందరు వీరిని తెలివిమాలినవారని అంటారు. ఫ్రాన్సు తలవాల్చినభారాన్ని వీరు మరింత అధికం

చేస్తారు. వీరెప్పుడూ అక్కడే ఉంటారు. ప్రజావ్యవహారాలనుకాని వ్యక్తిగత వ్యవహారాలనుకాని వీరు అనవసరంగా జోక్యం కలగజేసుకుని అస్తవ్యస్తం చేస్తుంటారు. తమ అశక్త తనే ఒక నైతికవర్తనగా అందరికి ప్రదర్శిస్తూ ఉంటారు. ఇలాటివారు పరిపాలనలోనూ సేనలోనూ మాజిస్ట్రేట్ కోర్టులలోనూ ఛేంబర్లలోనూ మనకు కనుపిస్తారు. వీరు దేశాన్ని ఒక చదునుకింద తయారుచేస్తారు. ప్రతిభాశాలులను చూచి వారు అవినీతి పరులని కుచ్ఛితులని నిందిస్తూఉంటారు. కాని అలాటి కుచ్ఛితులవల్ల కొన్ని ఉపయోగాలైనా ఉన్నాయి. వారి ప్రతిభను మనం కొనుక్కోకున్నా కొనుక్కోవచ్చు. కాని ఈ పై వారివల్లమాత్రం హానీలేదు మంచీలేదు.

కాబట్టి ఎవరు హాయిగాబ్రతుకుగడిపే యువకులో ఎవరుకారో మనం తొలిచూపులోనేచెప్పవచ్చు. హెన్రీ డిమార్సె అలాటి కులాసా యువకులకు చెందినవాడు. కాని ఉపరితర పరిశీలనదాటి కొంచెం లోతుకువెళ్ళి పరిశీలిస్తే పైకి ముచ్చటగా కనుపించే ఈవర్గం చాటున ఉన్నంతగా మోసం మరెక్కడాలేదన్న విషయం మనకు స్పష్టమవుతుంది. అయినా అందరూ ఇతరులకన్న తాముముందుగా ఉండాలని ఒకేవిధంగా ప్రయత్నంచేస్తారు. మంచికాని, చెడుకాని, అన్నివిషయాలను గూర్చి, మనుష్యులనుగురించి, సాహిత్యాన్ని గురించి, కళలనుగురించి వీరు మాట్లాడుతూనేఉంటారు. ప్రతిసంవత్సరం ఏపిట్ ఏపిట్ ఏవమాటలు చెప్పాడో ఆ మాటలే వీరు వల్లెవేస్తూఉంటారు. ఎవరైనాసంభాషిస్తూఉంటే మధ్యలో ఒక చిన్న పరాచికాన్ని విసిరేస్తారు. శాస్త్రాన్ని శాస్త్రవేత్తనూ

మధ్యమధ్యలో పరిహాసం పట్టిస్తారు. వారికి ఏ విషయాలూ తెలియకపోయినా వారా విషయాలను చూచి భయపడినా వాటిని గురించి అభిప్రాయాలు చెప్పడం మాత్రం మానరు. అన్ని విషయాలనూ తామే నిర్ణయించగలమని అనుకుంటారు. తండ్రులను తూలనాడడానికి తల్లులముందు మొసలికన్నీళ్ళు రాల్చడానికి సంకోచించరు. కాని నిజానికి వారికిఎందులోనూ నమ్మకంలేదు. స్త్రీలను ఎప్పుడూ నిందిస్తూఉంటాడు. కాని పైకిమాత్రం మర్యాదగా కనుపిస్తారు. చివరకు ఏవృద్ధస్త్రీ ప్రణయంలోనో దుష్టురాలైన ఏవేశ్య ప్రణయంలోనో పడి పోతారు. లెక్కలేనన్ని కష్టాలతోనూ పతనంతోనూ విజయం పొందాలనే అత్యాశతోనూ వీరు నరనరం శుష్కించిపోయిన వారే. వాళ్ళహృదయాల్లోకి నీవుతొంగిచూస్తే నీకు గడ్డ కట్టుకపోయిన రాయి తప్ప మరేమీ కనుపించదు. సాధారణ మైన పరిస్థితిలో ఎంతో ముచ్చటగా కనుపిస్తారు. ఎంతో ఆకర్షణీయంగానూ ఉంటారు. ఇట్టే స్నేహం చూపగలరు. వారి ధోరణిమాత్రం అనుక్షణం ఒకరీతిగా మారుతూ ఉంటుంది. కాని ఆ ధోరణిలోమాత్రం ఒకేవిధమైన మస్పితం కనుపిస్తూఉంటుంది. ముస్తాబులో ఎంతోవిడ్డూరంగా కనుపిం చాలని ప్రయత్నిస్తారు. అప్పుడు ఫాషన్‌లోఉన్న యాక్టర్ చేసే మూర్ఖతలను మాటిమాటికి చెబుతూంటారు. ఎవరో ఒకరితో ఏదో ఒక పరాచికం ఆడుతూనే ఉంటారు. ఒక విధంగా చెప్పాలంటే వీరిని తుఫానులా చెలరేగే తరంగాలపై చిందే తుప్పరతో పోల్చవచ్చు. చక్కగా దుస్తులువేసుకుని ముస్తాబై నృత్యంచేస్తుంటారు. ఊరినిండా కలరాఉన్నా,

వాటన్నా యుద్ధం సాగుతున్నా, విప్లవం సాగుతున్నా వీరికా పట్టింపు ఎంతమాత్రంలేదు. చివరకు వీరు ఖర్చుచేసే తరహా కూడా ఒకటే. అందరికీ ఒకరే టెయిలర్లు. ఒకేరకం ముస్తాబు. ఒకేరకంగా వినోదం సాగిస్తారు. వారిలోని తప్పులనే వడ్డీకిచ్చి బ్రతుకుతారు. మాసిన అద్దాలవంటి వీరి మనస్సుల్లో ఏ విషయమూ ప్రతిబింబించదు. ఇలా తను హెన్రీ డి మర్సెకు స్నేహితుడినని అతనిదగ్గరికి వచ్చిన కుర్రాడిది అసలు ఒక చిన్నగ్రామం. అప్పుడుగ్రామాల్లోని కుర్రవాళ్ళు తమకున్న పొలంపుట్ర అమ్ముకుని నగరానికి వచ్చి కులాసాగా కాలక్షేపం చెయ్యడం అలవాటు ఈ కుర్రవాడికికూడా గ్రామంలో కాలూనడానికి కొద్దిపాటి ఆస్తి ఉంది. హఠాత్తుగా తండ్రివైపు నుంచి ఒకపెద్ద ఆస్తివచ్చి ఇతనికి కలిసింది. ఆ తరువాత అతను పారిస్‌వచ్చి అక్కడి ఫాషన్లన్నీ నేర్చుకున్నాడు. చక్కని గ్లోవ్‌లు వేసుకోడం ముస్తాబులు చేసుకోడం ఎవరెవరికి ఎంతిచ్చి ఎలా పనులు చేయించుకోవాలో తెలుసుకోడం- ఇలాంటి విద్యలన్నీ నేర్చాడు. గుర్రాల విలువలు చెప్పగలిగేవాడు. ముస్తాబునుబట్టి నడకనుబట్టి చెప్పులనుబట్టి ఏస్త్రీ ఏ జాతికి చెందిందో చెప్పగలిగేవాడు. కొన్ని నాగరికులువాడే ఊతపదాలుకూడా నేర్చుకున్నాడు. ఇంగ్లీషు ఫాషన్‌లో టీ ని గురించి వెండినిగురించి పారిస్ సమాజంలో గల అభిరుచిని అలవరచుకున్నాడు.

డిమార్సె అతన్ని తన దగ్గర చేర్చుకున్నాడు, అతని ద్వారా లోకంలో తను కొన్ని పనులు సాధించవచ్చని అనుకున్నాడు. ఈ స్నేహం నిజమైనదైనా కపటమైనదైనా

డిమార్సెవల్ల స్నేహితుడైన పాల్ డిమానెర్‌విల్లె తనకు ఉప యోగం లేకుండా ఉండదనుకున్నాడు. ప్రతిఫలించి కాంతు లీనే అతని వెలుగులో ఎప్పుడూ నడుస్తూ వచ్చేవాడు. ఎప్పుడూ అతని గొడుగు నీడలోనే తాను నడిచేవాడు. అతని బూట్లే తాను తొడిగేవాడు, అతని కాంతినే తన కాంతిగా ధరించే వాడు. హెన్రీ ప్రక్కనే అతను ఉన్నప్పుడు, అతనితో కలిసి నడుస్తున్నప్పుడు 'మమ్మల్ని అవమానించకండి, జాగ్రత్త సుమా', అంటున్నట్లుగా ఉండేవాడు. నేను ఎంత చెబితే హెన్రీ అంత' అని అప్పుడప్పుడు అనేవాడు, కాని ఎప్పుడూ అతన్ని ఏమీ అడక్కుండా ఉండే జాగ్రత్తమాత్రం తీసుకునే వాడు. అతన్ని చూచి భయపడేవాడుకూడా. కాని ఆ భయం మాత్రం ఎవరికీ తెలిసేదికాదు. డిమార్సెకు మాత్రం దాని వల్ల ఉపయోగం ఉండేది.

"డిమార్సె వంటివారు ఏ వెయ్యిమందిలో కాని ఒక రుండరు. అతను ఏది కాదలచుకుంటే అది కాగలదు. చూడండి_ ఒకరోజున విదేశాంగ మంత్రి అవుతాడు. అతనికి ఎదురంటూ ఎన్నడూ లేదు'_ అనేవాడు పాల్. కార్పొరల్ ట్రిమ్ ఎప్పుడూ తన టోపీని ఉదాహరణగా ఎలా ఉపయోగిస్తాడో అలా ఎప్పుడూ డిమార్సెను ఉదాహరణగా ఉపయోగించేవాడు.

"డిమార్సెను అడిగిచూడండి. మీకే తెలుస్తుంది" అనే వాడు.

లేక

"మొన్న మేము వేటకు వెళ్ళాం. నేనూ డిమార్సె

కలిసివెళ్లాం, అతను నేను చెబితే నమ్మలేదు. కాని నా గుర్రాన్ని కదల్చకుండానే ఒక పొడ ఇట్టే దూకేశాను"

లేక

"నేనూ డిమార్నె కలిసి కొందరు స్త్రీలతో కలిసి ఉన్నాం..."

ఇలా అనేవాడు.

ఈ విధంగా పార్ డి మానెర్ విల్లెని జీవితంలో విజయం పొందే అవివేకుల జాతిలో చేర్చడానికి వీలుండదు. అతన్ని ఇప్పటిలో ఒక యువకుడు మాత్రం అంతే. అతని స్నేహితుడు ఉ[illegible]న్న అతన్ని గురించి ఇలా తన అభిప్రాయం వెలిబుచ్చాడు. "మీరు నన్ను పాల్ అంటే ఎవరు? పాల్ డిమానెర్ విల్లనే" అన్నాడు.

"ఆదివారంనాడు నీవిక్కడ కనుపించడం ఆశ్చర్యకరంగా ఉంది"– అన్నాడు పాల్ డిమార్నెతో

"అదే ప్రశ్న నిన్నూ అడగబోతున్నాను"

"అందులో ఏదైనా రహస్యం ఉందా ఏమిటి?"

"ఊ"

"ఆ విషయం — ఏమాత్రం హృదయంలో బాధ లేకుండా చెప్పగలను. ఆదివారాలనాడు ఒక స్త్రీ టులరీ వస్తుంది. అదీ విషయం హుందాంగా చెప్పాలంటే"

"ఆ. ఆ"

"ఇక మాట్లాడకు, పెదవులు కదిపితే అసలు చెప్పేది

కూడా మానేస్తాను, నీవెందుకు అంత బిగ్గరగా నవ్వుతావు? నీవలా నవ్వడం చూస్తే ఎవరైనా మనం ఎక్కువగా భోజనం చేశామని అనుకునిపోతారు. పోయిన గురువారం నాడు ఇక్కడ టెరాసెడె ఫులంట్‌లో నేను ఊరికే నడిచిపోతు న్నాను, దేన్నిగురించి కూడా ఆలోచించడంలేదు ఊరికే నడిచి పోతున్నాను, రూడి కాస్ప్రిగ్లోస్ గేటు చేరేసరికి ఒక స్త్రీ నాకు హఠాత్తుగా ఎదురైంది. స్త్రీ ఏమిటిలే ఒక యువతి అంటే అంతకన్న బావుంటుంది. నేను కొంచెం కనుపించి ఉండకపోయినట్లవుతే నామీద పడిపోయిఉండేదే. కాని నన్ను చూడగానే మర్యాదకోసం కాబోలు కాసేపు అలాగే ఆగి పోయింది. ఆశ్చర్యం ఆంగికచలనానికి అడ్డుతగిలి ఆగిపోలేదను కుంటాను. ఒక్కోసారి ఆశ్చర్యం మెరుపుతీగలా వెన్నులో నుంచి ప్రాకి కాళ్ళదగ్గర కాని ఆగిపోదు. అప్పుడు మనం నేలకు అంటుకునిపోతాం. ఇలాటి ప్రయోగాలు నేను చాలా పర్యాయాలుచేసి చూచాను. ఇది ఒక విధమైన జంతు సంబంధమైన అయస్కాంత శక్తిలాంటిది. సంబంధాలు పర స్పరం తూచినట్లు సరిగా ఉన్నప్పుడు ఈ శక్తి మరింత తీవ్రంగా పని చేస్తుంది. కానీ అబ్బాయ్, ఇదిమాత్రం అలాటి స్తంభన స్థితి మటుకేమీకాదు. ఆ పిల్లకూడా సామాన్యురాలేమీ కాదు. నైతికంగా చెప్పాలంటే ఆవిడ ముఖం ఇలా అంటున్న ట్లుగా ఉంది.

"నీవా నా జీవనాదర్శమా! నా ఊహల కుసుమమా, నా ఉదయ సాయంత్రాల కలవీనిన ఫలమా, ఎన్నాళ్ళకు కను పించావు! ఇవాళ ఉదయమేకదూ కనుపించావు. నిన్నటి ఉద

యం ఎక్కడున్నావు? నన్ను స్వీకరించవూ? నేను నీదాన్నే? 'బావుంది'- అనుకున్నాను నాలో నేను. తరువాత ఆ పిల్లని పరిశీలింపసాగాను. అబ్బాయ్! ఏం చెప్పను- శారీరికంగా చూస్తే – నేను కలుసుకున్న ఈ అపరిచితబాల – నెన్నడూ ఎరగని స్త్రీ సౌందర్యం ఆ అమ్మాయిలో ముద్దకట్టి కనుపించింది. రోమన్‌లు జ్వాలాంగన లని పిలిచే జాతికిచెందింది ఆ అమ్మాయి. నాకు ఆ అమ్మాయిని చూచీ చూడగానే తొలిగా తోచింది – ఇప్పటికీ ఆ దృశ్యం నన్ను వెంటాడుతూనే ఉంది – ఆ అమ్మాయి రెండు కళ్లు, పసుపురంగు కళ్లు. పులి కళ్ళ లాగున్నాయి, మిల మిల లాడే బంగారు పసుపు. సజీవమైన బంగారం ఆలోచించే బంగారం. ప్రేమించే బంగారం. నీ జేబులో దాగే బంగారం."

'అబ్బాయ్! నీ వొక్కడివే కాదు. ఆ అమ్మాయితో ఇలాగే పీగిపోయినవారు చాలామందిఉన్నారు. ఆ అమ్మాయి అప్పుడప్పుడు ఇక్కడికి వస్తూఉంటుంది. బంగారుకళ్ళ పిల్ల! అదీ మేము ఆ అమ్మాయికిపెట్టినపేరు. చిన్నది. ఇరవై రెండు సంవత్సరాలుంటాయి. అంతే. నేను బోర్‌బోన్లరోజుల్లో ఆవిడను ఇక్కడ చూస్తూండేవాణ్ణి. ఆవిడవెంట మరో స్త్రీ కూడా ఇక్కడికి వస్తూఉండేది. ఆ అమ్మాయికంటె లక్షరెట్లు ఎక్కువ అందంగా ఉండేది ఆ స్త్రీ.

'అలా మాట్లాడకుపాల్. ఈ పిల్లను అందంలో మించడం ఎవరికీతరంకాదు. ఈ పిల్ల నీ కాళ్ళవెంటే రాచుకుని తిరిగే ఒకపిల్లిలాంటిది. తెల్లనిపిల్ల. సాయంకాలపురంగు జుట్టు. రెబ్బలాటిపిల్ల. వ్రేళ్ళ మూడవకొసలో అందాలరేకలుండి

1729

ఉంటాయి. చెక్కిళ్ళ ఒక తెల్లని మిసిమిజాలువారుతూ ఉంటుంది. ఎండలు తళతళలాడే రోజుల్లో చెవులదగ్గర మొదలైన ఆ వాలు మెడలోవెళ్ళి అదృశ్యమైపోతుంది.'

'ఇక ఆ మహాస్త్రీ సంగతిచెప్పనా డి మస్సె! ఆవిడ కళ్ళు ఎన్నడూ కన్నీరెరుగని నల్లనికళ్ళు. కాని ఎప్పుడూ ఆ కళ్ళలోవెలుగు. కలిసే కనుబొమలు. పెదవులవంపు. ముద్దులు జారిపోయే పెదవులు. కొత్తగా పూచినట్టున్న పెదవులు. ఎండలా వెచ్చదనమిచ్చే శరీర సౌయగం. ఆవిడ— నిజం చెప్పనా— అచ్చంనీలానే ఉంది.'

'నీవు ఆవిడను అనవసరంగా పొగుడుతున్నావులంతే'.

'చక్కని విగ్రహం. తీగలాసాగేబళ్ళు పడవలాతేలే ఒళ్ళు'.

'ఏమవుతేమటుకేం? ఆవిడను నేను చూడనప్పుడు నాకు ఆవిడతో అవసరమేమిటి? నేను ఆడంగులను పరిశీలిస్తూ వచ్చిన నాటినుంచి ఈ అపరిచితబాల ఒక్కతె అనాఘ్రాత కుసుమగుచ్ఛాలవంటి ఉరోజాల నిర్మలత్వమేనన్నాకర్షించింది. నా కలలకన్నెను నాకు కనుపింపచేసింది. 'లాఫెమె కారెసన్ పిమరి' అనే ఆ వెర్రెక్కించే చిత్రపటానికి ఈ అమ్మాయి అసలులా కనుపించింది. ఏ నాడో ఎవరో ప్రతిభాశాలి తీవ్ర ప్రేరేపణ ప్రసరించిన మహా స్వప్నం అది. ఫ్రేస్కోలకోసం దాన్ని కాపీ వ్రాసుకున్నవారిచేత వ్యభిచరించబడి కళంకితం కావింపబడిన పవిత్రగీతం అది. మణిపూసలాటి ఈ బొమ్మలో ఏ విచిత్రమూ చూడలేనివారు మాత్రం ఈ బొమ్మని తమ

గడియారపు గొలుసులకు తగిలించుకుంటారు. కాని అది ఒక స్త్రీ యొక్క పరిపూర్ణ స్వరూపం. ఆనందం పొంగులువారే ఒక అగాధమైన లోతు. ఆ లోతులో దూకితే ఏది లోతో తెలీదు. ఆ స్త్రీని అప్పుడప్పుడూ ఏ ఫ్రాన్సులోనో ఏ ఇటలీ లోనో ఏ స్పెయిన్‌లోనో మనం చూడవచ్చు. నేను మళ్ళీ ఒకమాటు ఈ బంగారుకళ్ళ పిల్లను చూచాను. తన పెంపుడు పిల్లిని లాలిస్తూఉంది. ఎంచాతనో కాని ఆ మరుసటిరోజు కూడా అదే సమయానికి ఇక్కడికి వస్తుందని అనుకున్నాను. నేననుకున్నది అసత్యంకాలేదు. కనుపించకుండా ఆవిడవెన కాలే నడుస్తూ వెళ్ళాలని నాకోముచ్చటకలిగింది. ఏమీఆలోచని స్త్రీలాగా పచారుచేస్తూ మెల్లగా నడకసాగించే ఆ అమ్మాయి నడకతీరు చూడాలనిపించింది. అప్పుడు ఆ కదలికలలో నిద్ర పోయే ఆనందమంతా మనం గమనించవచ్చు. సరే, ఇలా ఉండగా ఆ అమ్మాయి వెనక్కు తిరిగింది. నన్ను చూచింది. సిగ్గుపడింది. మళ్ళీ నన్నుచూచింది. రెమ్మలావణికింది. అప్పుడు కాని నాకు ఆవిడను భద్రంగా తీసుకుని వస్తున్న స్పానిష్ స్త్రీ కనుపించలేదు. పూవులాంటి ఈ పిల్లను రక్షించడంకోసం ఆవిడను ఎవరో డబ్బిచ్చి నియోగించిఉంటాడు. అప్పుడు నాకు ఆ పిల్లపట్ల ప్రేమ మరింతఎక్కువైంది. నాకు ఒకవిధమైన ఆశ్చర్యంకూడా కలగసాగింది. ఈ రోజున ఆ పిల్లకోసం నేనిక్కడ కాచుకుని వున్నాను. ఆ పిల్ల పెంపుడుపిల్లిని నేనే.

'అదుగోవచ్చింది. అంతా అటువైపే చూస్తున్నారు'.

ఆ అపరిచితబాల సిగ్గుపడింది. ఆ అమ్మాయి కళ్ళు

వెలుగులీనాయి, హెన్రీని చూడగానే ఒకమాటు కళ్లు మూసుకుని ఆ ప్రక్కనుంచే వెళ్ళింది.

"ఆవిడ నిన్ను గుర్తించిందనుకున్నావా?"_ అనీ అడిగాడు పాల్ తాత్సారంగా.

"ఆ దేవత ఆ ఇద్దరు యువకులవంక తదేకంగా చూచింది. మళ్ళీ తిరిగి వెడుతూ హెన్రీని రాచుకునిపోయింది. తన చేతితో అతని చెయ్యి నొక్కింది, తరువాత తల తిప్పి వెనక్కు చూచి సోద్విగ్నంగా చిరునవ్వు నవ్వింది. కాని సంరక్షకురాలు మాత్రం ఆ అమ్మాయిని త్వరత్వరగా చెయ్యి పుచ్చుకుని లాక్కుని వెళ్లింది.

రంగుజుట్టు రెబ్బలాటి పిల్ల. వ్రేళ్ళ మూడవకొసలలో అందాల రేకలుండి వుంటాయి. చెక్కిళ్ళ ఒక తెల్లని పాలతరక జాలువారుతూ వుంటుంది, ఎండలు తళ తళ లాడే రోజుల్లో చెవులదగ్గర మొదలైన ఆ పాలజాలు మెడలో వెళ్ళి అదృశ్య కలిసిమవుతుంది పోతుంది."

"ఇక ఆ మరొక స్త్రీసంగతిచెప్పనా? ఎన్నడూ కన్నెరరుగని కళ్లు. కాని కళ్ళల్లోఎప్పుడూ వెలుగు...కలిసేకనులు పెదవుల వంపు. ముద్దులు జారిపోయే పెదవులు, కొత్తగా ఘూచినట్టున్న పెదవులు, ఎండలా వెచ్చదనమిచ్చే శరీర సౌయుగం.

ఆ స్నేహితులిద్దరూ ఆ పిల్ల వెనకాలే నడవసాగారు. చక్కగా హంసమెడలా లలితంగా సాగి తలలో కలిసిపోతున్న ఆ అమ్మాయి మెడలోని వింత లాలిత్యాన్ని పరికింపసాగారు. ఒక చిన్నారి జడచుట్ట ఆ మెడమీద రాలి ఎంతో ఇంపుగా

కనుపిస్తోంది. ఆ పిల్ల బంగారు కళ్లు తీర్చిదిద్దినట్లుగా వున్నాయి. సన్నని అడుగులు పిట్టల అడుగుల్లా గాలిలో తేలిపోతున్నాయి. అంతేకాదు — ఒక వెలుగు ఆ పిల్లచుట్టూ ఒక వానజల్లులా పడుతూవుంది. ఒక చిన్నగాను తొడిగింది, తోవలో నడుస్తూ మధ్యమధ్యలో తిరిగి హెన్రీవంక చూడసాగింది. ఎందుకొచ్చిన పీడ అన్నట్టుగా ఆ ముసలిదాని వెనకాల వడుస్తూ వుంది. ఆ ముసలిది ఆ పిల్లకు యజమానురాలిలాగానూ కనుపిస్తున్నది. బానిసలాగానూ కనుపిస్తున్నది. దాన్ని దెబ్బలు కొట్టగలనైనా గలదుకాని దాన్ని వదిలించుకోడం మాత్రం దుస్తరం ఇదంతా ఆ పిల్లనుచూస్తే స్పష్టంగా తెలుస్తూనేఉంది. స్నేహితులిరువురూ మా గేటుదగ్గరికి చేరుకున్నారు. ఇద్దరు ముస్తాబైన బంట్రోతులు ఒక చక్కని బండి తీసుకునివచ్చి ఆ అమ్మాయిముందు నిలవబెట్టారు. బంగారుకళ్ళపిల్ల మొట్ట మొదటగా ఆబండిలోకి ఎక్కింది. తనుచక్కగా కనుపించే చోట చోటుచేసుకుని కూచుంది. బండి తిరగగానే చెయ్యి బైటఉంచి చేరుమాలు ఊపింది. ఆ ప్రక్కనున్న వృద్ధురాలు ఏమనుకున్నా ఆ చేరుమాలుమాత్రం హెన్రీతో 'నావెంట రా' అని పిలుస్తున్నట్టుగాఉంది.

'ఇంతచక్కగా చేరుమాలు విసరడం ఎన్నడైనా చూచావా?' అని అడిగాడు హెన్రీపాల్‌ని.

తరువాత అక్కడినుంచి అప్పుడే కదలబోతున్న ఒక బగ్గీనిఆపి ఒకబేరం మాట్లాడి 'ఆబండి వెనకాలేవెళ్ళు. ఆ బగ్గీ ఆగేవీధి ఇల్లూ కనిపెట్టు — నీకు పదిఫ్రాంకులిస్తాను. "వస్తా పాల్'— అన్నాడు.

ఆ బండి ఆ బగ్గీ వెనకాలే వెళ్ళింది. ఆ బగ్గీ రూ సెయింట్ లాజరెలో ఒక చక్కని ఇంటిముందు ఆగింది.

డిమర్సె క్షణికమైన ఉద్రేకం ఉన్న వ్యక్తి కాదు. మరో యువకుడెవరైనా అయి ఉన్నట్లవుతే- ఆ అమ్మాయిని గురించిన సమాచారమంతా అప్పుడే తెలుసుకుని ఉండడానికి ఉబలాటపడి వుండేవాడే. కాని అనుభవంవల్ల తనని రూ సెయింట్ లాజరె లోనే మళ్ళీ ఇంటికి తీసుకుని వెళ్ళమని కోరాడు. ఆ మరుసటిరోజు అతని ఆంతరంగిక సేవకుడు ఆ అపరిచితురాలి ఇంటి దగ్గర వుత్తరాలిచ్చే సమయానికి కనిపెట్టుకుని ఉన్నాడు. మారువేషంలో వెళ్ళే పోలీసు ఆఫీసర్లలా తనూ ఆ ప్రక్కనే కనిపెట్టుకుని నిల్చున్నాడు. ఆ ఉదయం రూ సెయింట్ లాజరె రౌండ్లకు పోస్టువాడు రాగానే లారెంట్- తన ఒక పార్సెల్ అందించవలసిన వ్యక్తి పేరు మరిచిపోయిన పోర్టర్‌లాగా నటించి పోస్టుమన్‌ను ఆ పేరు అడిగాడు. మొదట్లో పారిషియన్ నాగరికతలో ఎంతో విదూరంగా కనుపిస్తున్న ఆ వ్యక్తిని చూచి మోసపోయి బంగారుకళ్ళపిల్ల నివసించే ఇల్లు డాన్ హిజాస్ మార్కిస్ డిసాన్‌రీల్ గ్రాండీస్పెయిన్ ఇల్లని చెప్పాడు. కాని నిజానికి అతనికి కావలసింది ఆ మార్కిస్ మాత్రం కానే కాదు.

'నేను తెచ్చిన పార్సెల్ మార్కిస్‌కోసం కాదు. మార్కిసీకోసం', అన్నాడు ఆ సేవకుడు.

'ఆవిడ ఇప్పుడు ఇక్కడలేదు. ఆవిడ ఉత్తరాలన్నీ లండన్‌కు పంపుతున్నారు'

'అయితే మార్కిసీ ఆ అమ్మాయికాదన్నమాట...' పోస్టుమన్ అతనివంక ఒకమాటుచూచి 'నేను ఎలాటిపోర్టర్ నో నీవూ అలాటి పోర్టర్ వే', అన్నాడు.

లారెంట్ కొన్ని బంగారు నాణాలు గలగల లాడించాడు. ఆ పోస్టుమన్ చిరునవ్వు నవ్వసాగాడు.

'ఇదుగో నీకు కావలసిన అమ్మాయిపేరు', అంటూ లండన్ స్టాంపుతో సహా ఒక ఎడ్రసు వున్న ఉత్తరాన్ని, అతనికి చూపాడు. దానిపై మాడమ్‌సెరెపాకిటావాల్డీకి, రూసెయింట్ లాజరె, హోటల్ సాన్ రీల్ పారిస్', అని వుంది. స్త్రీ దస్తూరి ముచ్చటగా కనుపిస్తూవుంది.

'ఇదుగో ఇవి తీసుకుని కొంచెం ఫలహారమూ ఒక ఛాబ్లిస్ బాటిల్ పానీయమూ పుచ్చుకో'- అన్నాడులారెంట్ ఆ పోస్టుమన్ స్నేహం సంపాదించుకోడానికి.

'తొమ్మిదిన్నర గంటలకు- నారాండ్ ముగిసిన వెంటనే... ఎక్కడ కలుద్దామో చెప్పు'.

'రూ-డి-లాఛాసిడి ఆంటిన్ మూలలో కలుద్దాం. పుయిట్‌సాన్స్ లిన్ దగ్గర రూనెపెడిమాథులిక్స్ దగ్గరా కలుద్దాం' అన్నాడు లారెంట్.

ఒక గంట తరువాత పోస్టుమన్ అతని పనులు ముగించుకుని హోటల్లో సేవకుని కలుసుకుని 'ఏమోయ్ స్నేహితుడా! మీ యజమాని ఈ అమ్మాయిని ప్రేమిస్తున్నాడంటే అతను చాలా పెద్ద పనే పెట్టుకున్నాడన్నమాట. ఆవిడను చూడాలనే ఈ నీ ప్రయత్నం సఫలం కాదనుకుంటాను. నేను పారి

స్‌లో పోస్ట్‌మన్‌గా పనిచేస్తూ వచ్చిన ఈ పది సంవత్సరాల్లోనూ నేను అనేక రకాలైన తలుపులు తట్టి చూచాను. కాని నీకు ఉన్నమాట ఉన్నట్టుగా చెబుతున్నాను. యమ్. డి. సాన్‌రీర్ ఇంటి తలుపంత విచిత్రమైన తలుపును నేనెక్కడా చూడలేదు. ఎవరూ ఇంట్లో అడుగుపెట్టడానికి వీల్లేదు. అంచాతనే ప్రత్యేకంగా దాన్ని పెరటికీ తోటకూ మధ్యగా ప్రక్కనున్న ఇండ్లతో ఏమాత్రం సంబంధం వుండడానికి వీలులేనట్టు కట్టాడు. కాపలా వుండే పోర్టరు వృద్ధుడైన ఒక స్పానిష్ దేశస్థుడు. అతనికి ఒక్కముక్కకూడా ఫ్రెంచి భాషరాదు, కాని ఊరికెనే వచ్చి పోయేవారివంక వెర్రివానిలా చూస్తూ కూచుంటాడు. వారు దొంగలన్నట్టుగా వారివంక చూస్తూ ఉంటాడు, నేను పోలికలకోసం చెప్పడంలేదు ఒక దొంగకాని ఒక ప్రేమికుడు కాని లేక నీవు కాని మరెవరైనా సరే ముందు హాల్లోకి వెళ్లారనుకో. అక్కడ ముందుగా మూసివున్న ఒక గాజుతలుపు కనుపిస్తుంది, ఒక బట్లరూ అతని చుట్టూ పోగైన మరికొందరు సేవకులూ కనుపిస్తారు. బైట నీకు కనుపించిన పోర్టర్‌కంటె కూడా వాడు ముసలివాడు. అంతకన్న గడుసరికూడా. ఇహ ఎలాగో ఒకలా పోర్టర్ లాడ్జిదాటి లోపల అడుగుపెట్టావనుకో. ఈ బట్లరు బైటికివచ్చి నిన్ను నిలదీసి నీవొక నేరస్థుడివైనట్టు నిన్ను లక్ష ప్రశ్నలు అడ్డదిడ్డంగా అడుగుతారు. ఒకమాటు నాకు — నేను వృత్తిచేత పోస్ట్‌వాణ్ణయినా — ఇలాగే జరిగింది. నేను చాటుగా నిల్చుని రహస్యాలు వినడంకోసం మారువేషంలో వచ్చిన వ్యక్తి ననుకున్నాడు. తన వెర్రి అనుమానానికి తనే నవ్వుకుంటూ నన్నలా ప్రశ్నించాడు. ఇక సేవకుల

సంగతి చెబుతాను చూడు. వాళ్ళనుంచి ఆవగింజంతయినా లాభం వుండదు, వాళ్లు మూగిబొమ్మల్లాంటి వాళ్లు. ఇహ ఆ చుట్టుపక్కల ఎవరికికూడా వారు మాట్లాడే భాష మానవ భాషో లేక అడివిభాషో తెలీదు. మాట్లాడనందుకు తాగుడు ముట్టనందుకు వారికి ఎంతెంత జీతాలిచ్చి వుంచారో నేను ఊహించలేకుండా వున్నాను. ఇంతకూ అసలు ఉన్న విషయం చెప్పాలంటే వాళ్ళను పట్టడమనేది ఏ విధంగానూ సాధ్యంకాని పని. వారిని ఎవరైనా కాల్చి చంపుతారనే భయంవల్లనో లేక వారి దగ్గరున్న సొత్తు దోచుకుని పోతారనే భయంవల్లనో- మరి ఎంచాతనో కాని వారు అలా వుంటారు. ఇక మీ యజమాని మదామసలి పాకిటూవాల్డె పైనున్న మక్కువ కొద్దీ ఈ గండాలన్నీ గట్టెక్కినా డోనాకాంచా మారి జవాను మాత్రం తప్పించుకోలేడు. ఆ సంరక్షకురాలు ఎప్పుడూ ఆ పిల్లతోనే వుంటుంది, పిల్లిని దాచుకున్నట్టుగా ఆ పిల్లను తన కోటులో దాచుకుని వుంటుంది. ఆ ఇద్దరు స్త్రీలూ ఒక క్షణం కూడా ఒకరిని ఒకరు విడిచి వుండరు. ఒకరినొకరు అంటుకుని పుట్టినవారిలా కనుపిస్తారు.''

లారెంట్ ద్రాక్షరసం తాగడం పూర్తిచేసి హోస్ట్ మన్‌తో ఇలా చెప్పసాగాడు. 'నీవు చెప్పినదంతా నిజమేకాని- నీవు చెప్పినదంతా చూస్తే నేను ఇంతకు మునుపే తెలుసుకున్న విషయం నిజమని ఋజువుచేస్తూవుంది. నిజం చెబుతున్నాను- వారంతా నన్ను పరాచికం పట్టిస్తున్నారని అనుకున్నాను. ఎదురుగావున్న ఆ పండ్ల దుకాణాదారు నాతో ఒకవిషయం చెప్పాడు. వీళ్ళు రాత్రిళ్ళు కుక్కలను వదులు

తారని వాటికి అందకుండా ఆహారం పైన వ్రేలాడదీస్తారని అంచాత అవి ఎవరుకనుపించినా మీదపడి కరుస్తాయని చెప్పారు. వాటిని ముక్కలకింద చెయ్యవచ్చునని నీ ఉద్దేశం కావచ్చు కాని అవి పోర్టర్ చేతితో అందించిన ఆహారాన్ని తప్ప మరిదేన్నీ ముట్టవని అంటారు'.

'బారన్ డినూసీన్‌గెన్ పోర్టర్ నాతో ఇదేమాట చెప్పాడు. అతని తోట హోటల్ సాన్‌గీల్ కొసను అంటుతూ వుంది', అన్నాడు పోస్ట్‌మన్.

'మంచిది. నా యజమానికి అతన్ని తెలుసు'- అనుకున్నాడు.

లారెంట్ తనలో తాను. "నీకు మరోవిషయం తెలుసా? అంటూ పోస్ట్‌మన్‌తో ఇలా చెప్పసాగాడు. 'నేను కొలిచే యజమానిలాంటి మనిషి ఎక్కడో కాని ఒకడుండడు. ఒక మహారాజ్ఞి పాదాంచలాన్ని ఆయన ముద్దాడాలని అనుకున్నా ఒప్పుకోని రాజ్ఞి ఉండదు. ఆయనకు నీతో అవసరమవుతే - ఆ విషయం నేనూ కోరుతున్నాను- ఆయనంతో వుదారుడూ- అప్పుడు ఆయన మనసుల్లో ఒకణ్ణిగా నిన్నూ లెక్కించవచ్చును కుంటాను'

మాన్షియర్ లారెంట్ నాపేరు మినాట్ మి-నా-ట్- ఇదే నాపేరు నేను వ్రాసుకునే తీరు.'

'ఆ- సరే-'

'నేను రూడిట్రయన్ ఫ్రెరె పదకొండో నంబరు ఇంట్లో అయిదో అంతస్తులో నివసిస్తాను. నాకు ఒక భార్య నలుగురు

బిడ్డలు. నీవు నామంచి కోరేది నా అంతరాత్మకూ నా ఆఫీసు బాధ్యతలకూ విరుద్ధంకాని అతిక్రమించని దవుతే నే నెప్పుడూ నీ మనిషినే'.

"నీవు చాలా నిజాయితీగల వ్యక్తివి?- అన్నాడు లారెంట్ తలపంకిస్తూ.

ఆ తరువాత హెన్రీ తన ఆంతరంగిక సేవకుడు చెప్పిన పరిశోధనా ఫలితాలను ఆలకించి, పాకిటూవాల్డె ఫెర్డినాండ్ రాజు మిత్రుడైన మార్కిస్ డిసాన్‌రీల్ వుంపుడుకత్తె అయి వుంటుంది. ఎనభైఏళ్ళ వృద్ధుడైన స్పానిష్ దద్దమ్మ కాని ఇలాటి జాగ్రత్తలు తీసుకోడు'- అన్నాడు.

"మాన్షియర్! ఒకమాట చెప్పమంటారా? బెలూన్ లేకుండా ఆ భవనంలోకి వెళ్ళడం అసాధ్యం"- అన్నాడు లారెంట్.

"వెర్రివాడిలా వున్నావు! పాకిటూనే అక్కడినుంచి బైటికి వస్తూంటే మనం ఆ హోటల్లోకి వెళ్లాల్సిన అవసరం ఏమిటి?"

"మరి ఆ సంరక్షకురాలివిషయం?"

"ఒకటి రెండు రోజులు ఆవిడను అక్కడే మూసే యిస్తాం."

"అయితే పాకిటూ మనచేతుల్లో వాలిందన్నమాటే"- అన్నాడు లారెంట్ చేతులు నలుపుకుంటూ.

"వెధవ! నాకు దక్కకముందే ఆ అమ్మాయిని గురించి ఇలా మాట్లాడావంటే నిన్ను కాంపా దగ్గరికి పంపుతాను. ఇక

కొంచెం నా ముస్తాబు సంగతి ఆలోచించు, నేను బైటికి వెళ్లాలి.''

హెన్రీ ఒక క్షణంపాటు ఆనందసాగరంలో మునిగి పోయాడు. ఈ ఆనందానికి కారణం అతను కావాలని కోరుకున్న స్త్రీలందరూ ఒక్కమాటు అతని స్మృతి ఫలకంలో మెరుపుతీగల్లా మెరిసి వుంటారు. ఒక సౌందర్యవంతుడైన యువకుణ్ణి ఆకర్షించగల స్త్రీని గురించి మనం ఏం భావించగలం? మనస్సుకు తెలివి ఎలాంటిదో దేహానికి అందం అలాంటిది. ఆత్మకు లావణ్యం లాంటిది అందం, డిమార్సె ఇంత సులభంగా ఇన్ని విజయాలు సంపాదించినా ఈ విజయాలతో అతను విరక్తి చెందాడు. ఇలా రెండు సంవత్సరాల్లోనూ తను బాగా అలసిపోయాడనే చెప్పాలి. ఆనందసాగరపు లోతుల్లో మునకలాడి అతను ముత్యాలకన్న ఎక్కువగా ధైర్యాన్నే ఏరుకుని వచ్చాడు. ఇలా ఇన్ని విజయాలను ఇంత సులభంగా సాధించడంవల్ల తవ నైతిక శారీరిక బలానికి పరీక్షా సమయం లాంటిది ఎప్పుడు వస్తుందా అని కనిపెట్టుకుని కూచున్నాడు. పాకిటా వాల్డెస్ అన్నివిధాలయిన అందాలతోనూ అతన్ని ఆకర్షించినా ఆవిడపట్ల అతనిలో ఆకర్షణమాత్రం ఏమాత్రం లేదు. వృద్ధుల్లాగాను విఫలాశలు పొందినవారిలాగాను అతనిలో అతిగా తీగలుసాగిన కోరికలూ ఊహలూ తీరినవెంట హృదయంలో ఎలాటి ముద్రనూ లిఖించక ఆరిన కలలూ — ఇవి మాత్రమే మిగిలిపోయాయి.

యువకులలో ప్రేమకన్న రమణీయమైన ఉద్వేగం మరేదీలేదు. అంతర జీవితాన్ని ప్రేమ పూలతోటగా చేసి

పరిమళాలు గుబాళింపచేస్తుంది. దాని తాలూకు అద్భుతమైన కాంతివల్ల అతిరమణీయమైన ప్రేరేపణలనూ మహోన్నతాలైన భావాలను పోషింపచేస్తుంది. పురుషుల విషయంలో ప్రేమ ఒక ఉద్వేగంగా పరిణమించింది. బలం మలినతకు దారి తీస్తూవుంది. వృద్ధుల విషయంలో అది వ్యసనంగా మారుతుంది. అశక్తతఅన్నది ఎటయినా మొగ్గుచూపుతుంది. హెన్రీ ఇలాటివాడే అతను వృద్ధుడు. పురుషుడు. యువకుడుకూడా. అయినా అతనిలో నిజమైన ప్రేమతాలూకు చిన్నెలు చెరిగి పోయాయి. ఆ దొరకని ముత్యం తాలూకు అద్భుతకాంతులు అతనిలో మిలమిలలాడడంలేదు. పారిషియన్లకు సహజమైన అహంమాత్రమే అతనిలో మిగిలివున్నది. ఫలానా స్త్రీని ఫలానా పతనావస్థకు మరలించాలనేకోరిక. కొత్తకొత్త అనుభవాలకోసం ఆశ్చర్యం అన్వేషణ.

ఇందులో విజయం పొందాలంటే హెన్రీ తన శక్తులన్నీ వినియోగించాలి. ఎప్పుడూ వినూతనంగానే కనుపించే ఆ యుగాలనాటి సుఖాంతనాటకంలో తను పాత్ర ధరించనున్నాడు. ఒక వృద్ధుడు ఒక యువతి ఒక ప్రేమికుడు— ఈ ముగ్గురే అందులోని పాత్రలు.

డాన్ హిజో పాకిటా డిమార్సె ఈ ముగ్గురే పాత్రలు. లారెంట్ ఫిగారోలా కనుపిస్తున్నాడు. ఇకచూస్తే ఈ నాటకం ఆ అసలు నాటకంకన్న ఎక్కువ చక్కగా వుండేట్లు కనుపిస్తున్నది. దీనికి కారణం కేవలం అదృష్టమనే చెప్పాలి. అదృష్టంకూడా ఒక రచయితలాగానే ప్రతిభాశాలి కాదూ?

"ఈ ఆట ఎంతో జాగర్తతో ఆడాల్సిన ఆట,' అనుకున్నాడు హెన్రీ తనలోతాను.

'అవును'- అన్నాడు పాల్ డిమానవర్‌విల్లె గదిలోకి ప్రవేశిస్తూ. "అంతా ఎలావున్నారు? కులాసా? నీతో కలిసి భోజనంచేదామని వచ్చాను" అన్నాడు.

"అయితే మంచిదే. నీకంటె ముందుగా ముస్తాబవుతున్నందుకు నీవు మర్లోలా అనుకోవుకదా?''- అన్నాడు హెన్రీ

"అదేమిటి? వెర్రి!''

"మనం ఇప్పుడిప్పుడు ఇంగ్లీషు వాళ్ళనుంచి చాలా విషయాలు నేర్చుకుంటూ వున్నాం. అంచాత వారిలాగా నే మనంకూడా కపట వ్యక్తులుగా తయారవుతామనుకుంటాను''- అన్నాడు హెన్రీ.

లారెంట్ తన యజమాని ముందు ఎన్నెన్నో పరికరాలు తెచ్చి వుంచాడు. అనేక రకాలైన పరికరాలు ఆ పరికరాలన్నిటిని చూచి పాల్.

"నీ ముస్తాబు రెండు గంటలయినా పట్టేలా ఉంది?''- అన్నాడు.

"రెండు గంటలేం? రెండున్నర గంటలయినా పడుతుంది'' అన్నాడు హెన్రీ.

"సరే, అవుతే మంచిదే అనుకుంటాను. ఇప్పుడు ఇక్కడున్నది మనం ఒకళ్ళమే కదా, అంచాత మనం మన ఇష్టం వచ్చినట్టు మాట్లాడవచ్చుననుకుంటాను సరేకాని ఒక చిన్న సందేహం అడుగుతాను చెప్పు. నీలాటి ఉత్తముడైన వ్యక్తి

ఈ ముస్తాబుకు ఇంతకాలం వృథా చెయ్యడం ఏమిటి? ఒక పావు గంట స్నానంతో ముగిసిపోయేదానికి రెండు గంటల సేపు నిన్ను నీవు అలంకరించుకోడమేమిటి? స్నానం పావుగంట. తల దువ్వుకోడం రెండు నిమిషాలు. ఇక దుస్తులు వేసుకోడం ఒక నిమిషం. ఈమాత్రం ముస్తాబు చాలదంటావా? ఇంతకు నీ పద్ధతి నాకు అర్థంకావడంలేదు చెప్పవూ మరి?''

''అశ్బాయీ! నీ మనస్సులో ఇంత ఉన్నతమైన భావాలు కలిగేట్టు చేశానంటే నేను చాలా గొప్పవాణ్ణై అయివుండాలి'' అన్నాడు ఆ యువకుడు. అప్పుడతను ఇంగ్లీషు సోపు రాసిన ఒక మెత్తని బ్రష్‌తో తన కాళ్లు మెత్తగా తుడిపించుకుంటున్నాడు.

''నాకూ నీకూ ఇంత ఆప్తబాంధవ్యం లేదంటావా? నీ ఆధిక్యత తెలిసినవాణ్ణి కాబట్టే నీవంటే నాకు ఇష్టం లేదు?''

''పరిశీలనా శక్తి నీకు ఏ అణుమాత్రమైనా వున్నట్లవుతే నీవు ఒక విషయాన్ని గమనించి వుండాలి. స్త్రీలు పైకి ఆడంబరంగా కనుపించేవాళ్ళనే ఎక్కువ ప్రేమిస్తారు''— అని చెప్పసాగాడు డిమర్సె పాల్ అన్న మాటలకు ఒక్క చూపుతో మాత్రమే సమాధానమిస్తూ.

'స్త్రీలు అలా ఎంచాత ప్రేమిస్తారో చెప్పనా? అశ్బాయ్. ఒక్క ఆడంబరం వున్నవ్యక్తులుమాత్రమే తమను గురించి తాము శ్రద్ధతీసుకుంటారు. ఒకడు తననిగురించి ఎక్కువశ్రద్ధ తీసుకుంటున్నాడంటే దాని అర్థం తనలోని ఇతరులకు చెందిన విషయాన్ని గురించి శ్రద్ధ పుచ్చుకుంటున్నట్టు కాదా?— తనకు తాను ఏవ్యక్తి చెందిఉండడో సరిగా అలాటి

వ్యక్తినే స్త్రీలు ప్రేమిస్తారు. ప్రేమ ఒక దొంగలాంటిది. ఇంతకూ స్త్రీలు ప్రేమించే వారిలోని సుకమారతనుగురించి కాదు నేను చెబుతున్నది. అతను ఎంతటిగొప్పవాడయినా— కులాసాగా కనుపించనివాణ్ణి స్త్రీ ప్రేమించినట్టు నీవు ఎన్నడైనా చూచావా? అలా ఎక్కడ జరిగిఉన్నా అది ఒక ఊహ అయిఉండాలి. ఒక్క నిర్లక్ష్యమే కారణంగా ఎందరో గొప్ప వారు మూరుమూలదాగి పోవడం నేను ఎరుగుదును. తన అందం తను ఎక్కువగా దిద్దుకునే కులాసా పురుషుడు తన ముచ్చట్లతోనే చెబుతున్నది. అతను ఎంతటిగొప్పవాడయినా కులాసాగా కనుపించని వ్యక్తిని స్త్రీ ప్రేమించినట్టు నీ వెన్నడైనా చూచావా? అలాటి సంఘటన ఒకవేళ ఎక్కడైనా జరిగి ఉన్నప్పటికి అది ఆ స్త్రీ తాలూకు విచిత్రమైన కులాసా ఊహల్లో ఒకటై వుంటుందని అనుకోవాలి. అదీకాక ఎందరో గొప్పవారు— ఒక్క వారినిర్లక్ష్యంవల్లనే ఎక్కడో మూరు మూల దాగిపోయిన వారిని నేను ఎరుగుదును! తన అందం పట్ల ఎక్కువ ఆసక్తిచూపే కులాసా పురుషుడు అసత్యంతోనూ ముచ్చట్లతోనూ ఎంతోసంబంధం కలిగినవాడై వుంటాడు. ఇక ఆ స్త్రీ విషయం ఏమిటి? స్త్రీ ఒక ముచ్చటైన వస్తువు. ఒక బొమ్మలాంటిది. నాలుగుగంటలసేపు ఒక స్త్రీని ముచ్చటపరుస్తూ కూచోవాలంటే ఒక్క రెండుమాటలు గాలిలో ఊదేస్తే ఆ మాత్రంతో చాలుతుందనుకున్నావా? ఆ కులాసా పురుషుడు రోజంతా తనతోనే గడుపుతాడనుకుంటుంది. అతనికి వేరే ఏ పనులూ లేవనుకుంటుంది. కీర్తికోసం కాని ఆదర్శాలకోసంకాని రాజకీయాలకోసంకాని కనులకోసం

కాని ఆవిడను నిర్లక్ష్యంచెయ్యడానికి వీల్లేదు. అర్థంలేని ఈ పడుపుకత్తెలన్నీ ఆవిడకు సనతుల్లాంటివి. ఒక చక్కని పరాచి కాన్ని ముసుగులా కప్పుకుని ఈ కులాసా పురుషులు స్త్రీని వినోదింపచేస్తారు. ప్రేమను ఒక పరాచికంగా భావించే వారి పట్లనే వారు కృతజ్ఞతచూపుతారు, అసలు ఒక కులాసా పురుషుడు నిజంగా అలాఉంటేనేకాని ఒక కులాసాపురుషుడు కాలేడు. స్త్రీలే అతనికి ఆ పదవిని ఇస్తారు. ప్రేమ దండ యాత్రకుపంపే వొక కల్నల్‌లాంటివాడు ఆ కులాసా పురుషుడు. అతనికి ఎన్నో విజయాలున్నాయి. అతని ఆజ్ఞప్రకారం వర్తించే స్త్రీ పటాలంకూడావుంది. అబ్బాయ్, పారిస్‌లో అందరికి అన్నివిషయాలూ తెలిసినవే, ఊరికే ఒకవ్యక్తి కులాసా పురుషుడు కావడంలేదు. నీకు వొక్క స్త్రీతోనే సంబంధంఉంది. నీవు కులాసా పురుషుడిగా ఉండుచూదాం! నీవు ఎప్పుడూ అలా హాస్యాస్పదంకాలేవు. అప్పుడు నీలో జీవమంటూ వుండదు. యమ్. డి. లాఫమెటీ అమెరికాకు యమ్. డి. టాలిరండ్ డిప్లమసీకి, డలాగరె సంగీతాన్ని యమ్. డి. సెగూర్ ప్రణయాన్ని ఎలా సంకేతాలో అలా నీవు అస త్యానికి వొక సంకేతానివవుతావు. అంచాత అబ్బాయ్, పాల్, ఆడంగులపై అధికారం చెయ్యాలంటే ఈ పటాటోపం తప్ప మరో మార్గంలేదు. చాలామంది స్త్రీలచేత ప్రేమింపబడే వ్యక్తి ఎన్నో గొప్పగుణాలుగలవాడుగా చలామణీఅవుతాడు.

కొంపతీసి, మనం కూడా అలాగే అనుకుంటాం. డ్రాయింగ్‌రూమ్‌లోకి వెళ్ళి ఐగ్లాస్‌లోనుంచి అదోలా చూచి_ అందులో విలువలేదనుకుంటున్నావా ఏమిటి? ... లారెంట్ ...

కాళ్లు నొప్పెడుతున్నాయి. సరేకాని పాల్, భోజనం కాగానే టులరే వెళ్ళి బంగారు కళ్ళ పిల్లను ఒకమాటు చూచివద్దాం"

చక్కగా కడుపార భోజనాలు ముగించుకున్న తరువాత యువకులిద్దరు టెరసీడి ఫలింట్ మీదుగా టులరెవైపు నడక సాగించారు. వారికి పాకిటా వాలెస్ ఎక్కడా కనుపించలేదు. ఆవిడకోసం యాభై మంది పారిస్ యువకులు అక్కడ కనిపెట్టు కుని వున్నారు. అంతా చక్కగా ముస్తాబయ్యారు, సెంట్లు రాచుకున్నారు. చక్కని దుస్తులు వేసుకున్నారు, నడుస్తూ మాట్లాడుతూ నవ్వుతూ కేరింతలాడుతూ వున్నారు.

"చూచారా ఈ తెల్లని మంద ఎలావుందో"- అన్నాడు హెన్రీ. "కాని నాకు ఒక విషయం స్ఫురిస్తూంది, ఈ అమ్మా యికి లండన్ నుంచి ఉత్తరాలు వస్తాయి. అంచాత మనం పోస్ట్ మన్ ను కొనడమో తాగించడమో చెయ్యాలి. అలా అవుతే కాని ఆ ఉత్తరం మనం తెరచి చూడలేము. లండన్ నుంచి ఆ ఉత్తరాలు వ్రాసేదెవరో ఆ ముసలిదానికి తెలిసివుండదు"

ఆ మరుసటిరోజున డిమర్సె మళ్ళీ టెరసెడి ఫలియంట్ పైగా నడుస్తూవచ్చాడు. పాకిటా వాలె కనుపించింది, అప్ప టికే అతనిలో ఆ అమ్మాయిపట్ల ఉద్వేగం అలంకరించుకుని వుంది. ఎప్పుడెప్పుడు ఆ కళ్లు కనుపిస్తాయాఅని అర్రులు చాచు తున్నాడు. ఆ కళ్ళనుంచి వెలువడే వెలుగు కిరణాలు సూర్య కిరణాల్లాగా వున్నాయి. ఆ కాంతిలో ఆమె దేహమంతా స్నానమాడుతున్నట్లుగా కనుపించింది. డిమార్సె వారు ఒకరి ప్రక్కగా ఒకరు వెడుతున్నప్పుడు ఆ అమ్మాయి దుస్తులను ఎప్పుడెప్పుడు రాచుకునిపోదామా అని కాచుకుని కూచు

న్నాడు. కాని ఎప్పుడూ అతని ప్రయత్నాలు విఫలమవుతూనే వచ్చాయి. కాని ఒకమాటు మాత్రం అతను వారి ప్రక్కగా వెడుతూ బంగారుకళ్ళ పిల్లకు ప్రక్కనే వెళ్ళడం జరిగింది. అతను తిరిగి వచ్చేసరికి పాకిటాకూడా ఎంతో ఉద్వేగంతో త్వరత్వరగా ముందుకు రాసాగింది. డిమార్సె చెయ్యి ఎంతో నాజూకుగానూ వేగంగాను తాకింది, అప్పుడు అతనిలో ఒక విద్యుచ్ఛక్తి తీగలా దూసుకుని పోయినట్లయింది. ఒక్క క్షణంలో అతనిలోని యావనోద్వేగాలన్నీ జ్వాలల్లా చెలరేగ సాగాయి. ఇరువురు ప్రేమికులూ ఒకరివంక ఒకరు చూచుకో గానే పాకిటా సిగ్గుపడినట్లయింది. హెన్రీ చూపులూ తన చూపులూ కలుస్తాయేమోనని భయపడినట్టుగా కండ్లు దించు కుంది. అలా దించుకునిపోయిన ఆ అమ్మాయి చూపులు అతని కాళ్ళపై నిలిచిపోయాయి.

"ఈ అమ్మాయిని నా ప్రేయసిని చేసుకుని తీరాలి" అనుకున్నాడు హెన్రి.

లూయీ ఒక భవనంవైపుకు ఆవిడ వెంటనే నడుస్తూ పోగా మార్కిస్‌డి సాన్‌రీల్ కనుపించాడు. ఒక స్నే[illegible]ని బుజంపై చెయ్యి వుంచి నడుస్తున్నారు. హెన్రీపట్ల ఆట్టే నమ్మ కంలేని కాంపా, పాకిటా తన ప్రక్కనే నడిచిపోయేలా చేసింది.

"నీవు లొంగవేమో ఒక నల్లమందు మాత్రఇస్తే ఇట్టే నిద్రపోవూ" అనుకున్నాడు హెన్రీ ఆ సంరక్షకురాలివంక ఒక చూపు విసిరి.

బండి ఎక్కబోయేముందు బంగారుకళ్ళ పిల్ల తన ప్రియునితో కొన్ని చూపులు మార్చుకున్నది. ఆ చూపుల్లో

అర్థం హెన్రీకి తెలియందికాదు, ఆ అమ్మాయి అలాచూస్తోంటే హెన్రీ నిలువెల్లా నీరైనాడు. కాని ఈలోగా సంరక్షకురాలు ఆ అమ్మాయి అలా చూడడం చూచింది. త్వరత్వరగా పాకి టాతో ఏవోకొన్ని మాటలు అన్నది. పాకిటా వెంటనే నిరా శగా బండిలో వాలిపోయింది, కొన్నాళ్ళవరకు పాకిటా మళ్ళీ టులరీలో కనుపించలేదు. లొరెంట్ తన యజమాని ఆజ్ఞల ప్రకారం హోటల్ దగ్గర కనిపెట్టుకునే వున్నాడు. ఆ చుట్టు ప్రక్కలున్నవారి వద్దనుంచి మార్కిస్ కాని ఆ ఇద్దరు స్త్రీలు కాని సంరక్షకురాలు ఆ అమ్మాయి హెన్రీవంక అలా చూడడం కనిపెట్టినప్పటినుంచి బైటికి రావడంలేదన్న సమాచారం తెలుసుకున్నాడు. ఆ ఇరువురు ప్రేమికులను అలా క్షణంపాటు ఏకంచేసిన ఆ బంధం ఇంతలోనే తెగిపోయింది. కొన్నాళ్ళ తరువాత — ఎలా జరిగిందో కాని — డిమర్సె కోరిక ఫలిం చింది. లండన్‌నుంచి మదామసలివాళ్లెకు వుత్తరాలపై సీళ్ళ వంటి సీలునూ మైనాన్ని హెన్రీ సంపాదించాడు. సరిగ్గా ఆ వుత్తరం వ్రాసేవ్యక్తి వుపయోగించే కాగితంలాంటి కాగి తాన్నే సంపాదించాడు. ఫ్రెంచి, ఇంగ్లీషు పోస్టు గుర్తులన్నీ సంపాదించాడు. లండన్‌నుంచి పంపినట్టుగా ఈ క్రింది వుత్త రాన్ని పంపాడు.

'నా ప్రియమైన పాకిటా— నాలో నీవు రేకెత్తింప చేసిన వుద్వేగాల తాలూకు మాటలతో ఇప్పుడు నిన్ను నేను చిత్రించబోవడంలేదు. నా భాగ్యం కొద్దీ— నీవు నాకు నిరా కరణ తెలపకుండావుంటేచాలు— ఇలాగే ఇకనీతో వుత్తర ప్రత్యుత్తరాలు నడవగలను. నాపేరు అడాల్ఫ డి గాగా. నేను

నివసించేచోటు No. 54 రూడి యూనివర్సిటి. నీవు నాకు మారువుత్తరం వ్రాయడానికి వీలుపడని పక్షంలో— నీ దగ్గర కలంకాని కాగితంకాని లేని పక్షంలో— నీ మౌనాన్నిబట్టే ఆ విషయం నేను అర్థంచేసుకోగలను. రేపు ఉదయం 8 గంటల లోగాకాని సాయంత్రంలోగాకాని నీతోటలోనుంచి బారన్ డి నూసింగన్ తోటలోకి వొక వుత్తరం నీవు విసిరేయకపోతే, అక్కడ నీకోసం నామనిషి వొకడు కనిపెట్టుకునివుంటాడు. అతను రెండు ఫ్లాస్కులు వొక తీగద్వారా నీగోడపైగా ఆ మరుసటి వుదయం పదిగంటలకు నీకు అందచేస్తాడు, ఆ రెండిటి లోనూ వొక ఫ్లాస్కులో నల్లమందువుంది. దాని ద్వారా నీవు నీ సంరక్షకురాలిని నిద్రపుచ్చవచ్చు. రెండో గ్లాసు ఫ్లాస్కులో సిరావుంది. ఈ రెండు ఫ్లాస్కులు చాలా చిన్నవి. నీవు నీ వురోజాల జాకెట్‌లో వీటిని దాచుకోవచ్చు. నీకు ఈ వుత్తరం వ్రాయడానికి పడినపాట్లన్నీ చెబితే నిన్ను నేనెంత ప్రేమిస్తున్నానో నీకే తెలుస్తుంది. నీవు ఇంకా సందేహిస్తూ వున్నట్లయితే, నీతో వొక్కగంట మాట్లాడే అవకాశం కోసం నేను ప్రాణాలైనా వీడగలను'.

'నిజంకాని అబద్ధంకాని ఈమాట వీళ్ళు నమ్మేస్తారు. ఇలాటి ప్రేమలేఖను చూచి మోసపోయి సంతోషించే పిల్లను ఏమనుకోవాలి?'' అన్నాడు హెన్రీ.

ఈ ఉత్తరం ఆ మరుసటిరోజు వుదయం 8 గంటలకు పోస్ట్‌మన్ మాస్టర్ మినట్ హోటల్ సాన్‌రీల్ పోర్టర్‌కు అందచేశాడు. ఇక తన కార్యరంగానికి దాపుగా వుండాలనే వుద్దేశంతో డిమర్సె ఆ రోజు పాల్‌దగ్గరకు వెళ్లి అతనితో

కలిసి వుదయపు భోజనం ఆరగించాడు. పాల్ రూడి పెపినె రెలో వుంటున్నారు. రెండు గంటలకు స్నేహితులిద్దరూ కులాసాగా నవ్వుకుంటూ ఒక నిర్ణీతమైన రాబడిలేకుండా కులాసాగా జీవితాన్ని గడపడానికి యత్నించి వొక యువకుడు జీవితంలో పడేఇబ్బందులనుగురించిముచ్చటించుకుంటున్నారు. అప్పుడు హెన్రీ బండివాడు పాల్ యింటికి తన యజమానిని వెదుకుకుంటూ ఎవరో వొక విచిత్రమైన వ్యక్తి ఆయనతో మాట్లాడటానికి వచ్చాడని చెప్పాడు. ఆ వచ్చిన వ్యక్తి చూపులకు వొథెల్లోలాగ కనిపిస్తున్నాడు. ఆఫ్రికా దేశస్థుడు, మరే ఆఫ్రికాదేశీయుని ముఖంలోను అంతటి ప్రతీకారము అంతటి అనుమానము అంతటి ఆలోచనా సాహిత్యము మనము చూడబోము. అతని కళ్లు నల్లగా వున్నాయి, ఎవరికోసమో కాచుకున్న గెద్ద కళ్ళలాగ వున్నాయి. అతని నుదుట్లో అల్పత్వం కనిపిస్తోంది, అతన్ని చూడగానే అతని మనసులో యేదో బరువు మోస్తున్నట్లుగా తోస్తోంది అతనిచేయి తీగలా సాగిపోతోంది.

అతని వెనకాలే మరోవ్యక్తికూడా వచ్చాడు. అతన్ని చూడగానే నాగరికత అంటూ ఎరగని యే ఎడారి దేశాన్నుంచో వస్తున్నట్లు కనిపిస్తున్నాడు. అతని ముఖం తెల్లగా ముడతలుదేరివుంది, పొడుగైన గడ్డం. పొడుగ్గా మెడకు వేలాడదీసిన మఫ్లరు, మరకలు పట్టివున్న షర్టుకాలరు, పాత హేటు ఆకుపచ్చని ఫ్రాకుకోటు, చిరిగిపోయిన ట్రౌజర్లు, మాసిపోయిన వేస్టుకోటు. బురదకొట్టుకున్న చెప్పులు — యిదీ అతని రూపం! అతన్ని చూడగానే ఎవరో అభాగ్యుడని తోస్తుంది. ఇలాంటి అభాగ్యులను పారిస్‌లో మనం ఎంతోమందిని చూడవచ్చు.

"మనం ఇక్కడున్నట్లు ఎట్లా కనిపెట్టారు మీరు? ఈ అద్భుత వ్యక్తుల్ని ఎక్కడనుంచి పట్టుకువచ్చావోయ్" అన్నాడు హెన్రీ.

"పిల్లను చూస్తే నాకు నిజంగా వణుకుపుడుతోంది సుమా" అన్నాడు పాల్.

"వారెవరు? నిన్ను చూస్తే క్రైస్తవుడిలా కనిపిస్తున్నావు? నీవెవరు?" అనడిగాడు హెన్రి, ఆ అభాగ్యుడిని చూచి.

ఆ వ్యక్తి ఆ యిద్దరు వ్యక్తులవైపు తదేకమైన దృష్టి సారించాడు. అతనికేమీ అర్థమయినట్లు లేదు, పెదవుల కదలికలనుబట్టే యేదో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

"నేనొక వ్రాయసకాడిని, నాకు భాషలుకూడ వచ్చు. తర్జుమాచేసి చెబుతూవుంటాను, నేను పలి యస్‌డీజస్టిస్‌లో నివశిస్తూవుంటాను. నా పేరు పాయిన్‌సట్."

"మంచిది. అయితే యితడెవరు?" అనడిగాడు హెన్రి.

"నాకు తెలియదు. అతను ఒకవిధమైన స్పానిష్‌భాష మాట్లాడుతాడు, మీ మాటలు నాకు అర్థం కావడంకోసం నన్నిక్కడకు తీసుకువచ్చాడు."

మొండిగా కనపిస్తున్న ఆ వ్యక్తి తన జేబులోనుంచి ఒక ఉత్తరం తీసి హెన్రీకి అందించాడు. ఆ వుత్తరం హెన్రీ పాకిటాకు రాసింది, హెన్రి దానిని మంటలో పారేశాడు.

"అయితే ఆట మొదలవుతూంది" అనుకున్నాడు హెన్రి తనలో తాను...

"పాల్ ఒక్కనిమిషం మమ్మల్ని వదలి వెళ్ళు" అన్నాడు.

"ఈ ఉత్తరం అతనికోసం నేను తర్జుమాచేసి చెప్పాను" అని చెప్పసాగాడు ఆ తర్జుమాదారుడు. "నేను తర్జుమాచేసి చెప్పగానే అతనెక్కడకో వెళ్ళాడు. నాకావిషయం సరిగా గుర్తులేదు – తరువాత మళ్ళీ నాకోసం వచ్చి అతన్ని నేను ఇక్కడకు తీసుకువచ్చినందుకు రెండు లూయీలుయిచ్చాడు."

"నీవు నాతో చెప్పదల్చుకున్నదేమిటి నిగ్గర్?" అనడిగాడు హెన్రీ.

"నిగ్గర్ అనేపదాన్ని నేను తర్జుమా చేయులేదు" అన్నాడు అనువాదకుడు.

అత నిలా చెప్పుతున్నాడు "రేపురాత్రి పదిన్నర గంటలకు మీరు బోలెవార్డ్ మాలట్ మార్ట్రె దగ్గరున్న కేఫ్ దగ్గర వుండాలి. అప్పుడక్కడి కొకబండి వస్తుంది, ఆ బండ్లో మీరు ఎక్కాలి. మీరు కోర్టెజో అన్న స్పానిష్ మాట పలకగానే ఆ బండివాడు మీకోసం తలుపు తెరుస్తాడు. ఆ మాటకు అర్థం ప్రేమికుడని" అని చెప్పాడు పానిసెట్, హెన్రివంక సంతోషంగా చూస్తూ.

"మంచిది."

మొండిగా కనిపిస్తున్న వ్యక్తి, అనువాదకునకు రెండు లూయీలు యివ్వబోయాడు. కాని డిమార్సె అందుకు వప్పుకోలేదు, తానే ఆ డబ్బు యివ్వబోయాడు. అప్పుడు మొండిగా కనిపిస్తున్న వ్యక్తి యేదో మాట్లాడబోయాడు.

"యేమిటి అతనంటున్నది"

"నన్ను హెచ్చరిక చేస్తున్నాడు, నేను యేమాత్రం పొరపాటు చేసినా నా గొంతునులిమి వేస్తానంటున్నాడు. అతన్నిచూస్తే అంతపనీ చేశేవాడుగానే కనిపిస్తున్నాడు."

"నిజమే – అలానే వున్నాడు." అన్నాడు హెన్రి.

"అతనా తమకు మర్గో విషయంకూడా చెబుతున్నాడు "అతన్ని పంపించిన స్త్రీ మీకోసము ఆవిడకోసము తమరిని ఎంతో జాగ్రత్తగా మసలుకోవలసిందని అర్థిస్తూ తమరు ప్రయాణం చేస్తున్నది ఒక కత్తులబోను అని తెలియజేస్తున్నది" అన్నాడు అనువాదకుడు.

"సరే, అయితే – మరీమంచిది – యింకా గమత్తుగా వుంటుంది – యిక నీవు రావచ్చు పాల్" అని హెన్రీ స్నేహితుడిని గదిలోకి పిలిచాడు.

అంతవరకు పాకిటావాల్డై ప్రేమికునివంక తదేకంగా చూస్తున్న మొండివ్యక్తి అనువాదకునితో కలిసి వెళ్లిపోయాడు.

"సరే, చివరకు నేననుకున్నంత జరిగింది – పూర్తిగా ప్రణయకలాపాన్ని సంపాదించాను." అన్నాడు హెన్రి, పాల్ తిరిగిరాగానే. "ఎన్నో ప్రణయకలాపాలలో యిదివరకు మునిగి తేలింతర్వాత చివరకు పారిస్‌లో ఎన్నో ప్రమాదాలతోకూడిన యీ ప్రణయకలాపం కనుక్కోగలిగెను. చాలా బాగుంది, ప్రమాదం స్త్రీకి ఎంతటి ధైర్యాన్నిస్తుంది! ఒక స్త్రీ హింసలు పడటం అనేక పరీక్షలకులోను కావడం దీనివల్ల ఒక్కక్షణంలో సంవత్సరాలతరబడి దాటలేని అవరోధాలను దాటే ధైర్యం స్త్రీకి వస్తుంది. అమ్మాయీ! లే – చనిపోతావా,

1729

పాపం, కత్తులబోనులాగా వుందా? స్త్రీల ఊహలు ఎంత చిత్రంగా వుంటాయి. వాళ్లు వారి చిన్న చిన్న పరాచికాలను పెద్ద పెద్ద విషయాలలా చెబుతారు. అదీకాక ఎవరయినా యీ విషయం అనుకోగలరా పాకిటా? చివరకెలాగయితేనేం యీ అందగత్తెను పొందగలిగాను. ప్రకృతి కుసుమించిన అద్భుతమైన పుష్పం నా చేతిల్లో చిక్కింది. ఇక యీ ప్రణయ కలాపంలోని అందంకాస్త హటాత్తుగా మాయమయింది!

హెన్రీ ఇలా ముచ్చటగా హాయిహాయిగా మాట్లాడుతూవుంటే అతనిలోని యువకుడు అతనిలో మళ్ళీ తొంగి చూచాడు. రేపటివరకు వేచివుండాలి, అంతవరకు హాయిగా బాధలేకుండా వేచివుండటంకోసం మితిమించిన సుఖలాలసలో ఆ రోజంతా మునిగిపోయాడు. కులాసాగా ఆటలాడుకున్నాడు. భోజనం చేశాడు. స్నేహితులతో కలిసి విందు చేసుకున్నాడు. చేప నీరుతాగినట్లుగా హాయిగా తాగాడు. పేకాటలో మునిగి పోయాడు పదిపన్నెండు ఫ్రాంకులు గెల్చుకున్నాడు.

“రౌభన్‌డి కాంకేల్,’ రాత్రి రెండు గంటలకు కాని వదలలేదు. ఇంటికి వెళ్ళి పసిపిల్లవాడిలా హాయిగా నిద్రపోయాడు, ఆ మరుసటిరోజు హాయిగా తీయగా నిద్రలేచాడు. టులరీ వెళ్ళడానికి చక్కగా ముస్తాబయ్యాడు, పాకిటాను చూచివచ్చిన తరువాత విందుకు వెళ్ల వచ్చుకదా అనుకున్నాడు. అలా హాయిగా కాలం గడపాలనుకున్నాడు.

అనుకున్న సమయానికి హెన్రీ సరిగా బోలివర్డ్‌లో తయారయ్యాడు. అనుకున్నట్టుగానే బండి ఆగివుంది, తన సంకేతంతాలూకు మాట చెప్పాడు. ఆ మాట వినగానే

ఒకతను వెంటనే బండి తలుపు తెరచి దిగివచ్చాడు. హెన్రీని బండిలో ఎక్కించుకుని సాగిపోయాడు, బండి మెరుపుతీగలా పారిస్ వీధుల్లో సాగిపోతూంది. హెన్రీ పరధ్యానంగా వున్నాడు, అంచాత తను వెడుతున్న పారిస్ నగరవీధులు అతని మనస్సుకు ఏమాత్రం పట్టడంలేదు. బండి ఎక్కడ ఆగిందో కూడా తను గమనించలేదు. బండి దిగగానే ఆ వ్యక్తి హెన్రీని ఒక ఇంటి లోనికి తీసుకుని వెళ్ళాడు. ఇంటివాకిటి దగ్గరే మెట్లవరుసవుంది. మెట్లవరుస చీకటిగావుంది, హేన్రీ లేచి ఉండవలసి వచ్చిన వరండాకూడా చీకటిగానే వున్నది. ఆ వ్యక్తి తడిగా వున్న ఒక హాలు తలుపు తెరిచాడు, హాలులో దీపాలు లేవు. మసకగా కనుపిస్తున్నది. ప్రక్క గదిలోనుంచి ఒక కొవ్వొత్తి తీసుకుని వచ్చాడు. ఆ హాలును చూస్తే ఎవరో కొంత కాలం నివసించి ఖాళీచేసి వెళ్ళిపోయిన ఇంటిలాగా కనుపిస్తున్నది. అప్పుడు యానీరార్‌క్లిఫ్ ప్రణయ యాత్రలు అతనికి జ్ఞప్తికి వచ్చాయి. ప్రేమికుడు ఏదో విషాదకరమూ విచారకరమూ అయిన ప్రదేశంలో నిర్జనమైన ఖాళీ ప్రదేశాల్లో నడిచివెడుతున్న దృశ్యాలు జ్ఞప్తికి వచ్చాయి.

చివరకు అతను సెలూన్ తలుపు తెరిచాడు. పాత ఫర్నిచరు, మాసిపోయిన తెరలూవున్న ఆ గదిని చూస్తే ఒక వేశ్యాగృహం తాలూకు వాతావరణం ఆ గదిలో కనుపించింది. అక్కడ అలాటిపై పటాటోపమేకనుపిస్తూవుంది. అలాటి అభిరుచిలేని మురికిపట్టిన మసిపట్టిన వస్తువులే ఏర్పరచబడి వున్నాయి.

ఒక సోఫామీద మాసిన ఎర్రసిగుడ్డ పరచబడివుంది. ఆ ప్రక్కనే హుక్కాగుండా. ఆరిపోయినబూడిద ఆ ప్రక్కన

ఒక వృద్ధురాలు, పేదదుస్తులు వేసుకుని కూచునివుంది. ఇంగ్లీషు స్త్రీలు ఒక వయస్సులో ధరించే ఒక విడ్డూరంగా కనుపించే టోపీ పెట్టుకునిఉంది. ఆగది— ఆ ముసలిది— చల్లారినపొయ్యి— అక్కడ పాకిటూనే కనుక లేకపోతే ఎవరికైనా అక్కడే నిలువునా ప్రేమ గడ్డకట్టుకునిపోయి ఉండేదే. అక్కడ ఒక మూలగా పాకిటూ కూచునిఉంది. వదులుగా జారుతున్న వలిపం లాంటి గౌను వేసుకున్నది. బంగారు జ్వాలల్లాంటి చూపులు పూలు విరజిమ్మినట్టు విరజల్లుతూంది. ముచ్చటైన ముత్యాల పాదాలు చూపుతూంది. మెరుపుతీగలా కదులుతూంది. ఈ తొలి కలయిక నిజంగా చాలా చిత్రంగానేఉంది. ఇద్దరు ఉద్విగ్న హృదయులైన ప్రేమికులు ఎంతోదూరం ప్రయాణం చేసి ఒకరినొకరు కలుసుకుంటారు. పరస్పరం ఒకరికొకరు తెలియదు. అప్పుడు ఎలాఉంటుంది? మొదట్లో అలాటి సమావేశంలో కొన్ని అపశ్రుతులు వినిపించకపోవు. కాని ఇరువురి తనువులూ ఏకంకాగానే ఆ కౌగిల్లో ఆ అపశ్రుతులన్నీ సర్దుమణిగి పోతాయి.

వాంఛ పురుషునికి ధైర్యాన్నిచ్చి అతనికి నిగ్రహం కోల్పోయేలా చేస్తుంది. కాని ప్రేయసి విషయంలో మాత్రం ఇది నిజంకాదు. ఆవిడప్రేమ ఎంతటిదైనా తన స్త్రీత్వాన్ని కోల్పోయేబాధలో ఆ కొసకు అంతతొందరగా అంతసులువుగా చేరుకోడానికి సంకోచిస్తుంది. తనను తాను అంత సులువుగా సమర్పించుకోడానికి సిద్ధపడదు. చాలామంది స్త్రీలకు అది ఒక అగాధంలోకి కూలిపోవడంలా కనుపిస్తుంది. అక్కడ ఆ అడుగున ఏముంటుందో వారు ఊహించుకోలేరు. స్త్రీకి

సహజంగా వచ్చే ఈ సంధిస్థితి ఆవిడ ఉద్వేగాన్ని ఒప్పుకున్నట్టుగానే ప్రేమికుని దృష్టికి కనుపిస్తుంది. ఈ విధంగా వారి ఆత్మలచుట్టూ పొగతీగల్లా తేలిపోయే భావాలు వారిలో ఒక తాత్కాలిక విషాదాన్ని కలిగిస్తాయి. తీయని ప్రేమలో కాలలో ఇరువురు ప్రేమికులు సాగించే మధుర యాత్రలో ఈ క్షణం దాటకతప్పని ఒక బీడు భూమిలాంటిది. చెట్టూ చేమా కనుపించని ఎండు నేలవంటిది. ఆ ప్రదేశంలో ఒకే పర్యాయం తడి వెచ్చదనం ప్రక్క ప్రక్కనే కనుపిస్తాయి. కాలూనడానికి వీల్లేని ఎడారి ఇసుకలూ, బురదభూములూ. చివరకు చేరేదిమాత్రం గులాబీ పూలపొదరిళ్ళు. చిరునవ్వులు వెదజల్లుతూ దూరంనుంచి పిలుస్తూనేఉంటాయి.

అక్కడ ప్రేమ తన సుఖాల సేవకులతో అక్కడ వారి కోసం పచ్చని పట్టుతివాసీ పరిపించి ఉంచింది. ఒక్కోసారి హాస్యంగల వ్యక్తి ఒక చిరునవ్వునవ్వుతాడు. అన్నిటికీ అతని సమాధానం అదే. అతనివాంఛల ఒత్తిడికింద అతనిహాస్యమంతా అణిగిపోయిఉంటుంది. సమ సౌందర్యంగల ఇరువురు వ్యక్తులు తొలిగా కలుసుకున్నప్పుడు ఎంతో అతి సామాన్యమైన మాటలనే– అవీ చెదురు చెదురుగా మాట్లాడడం– మధ్య మధ్యలో ఒకమాట– వణుకుతున్న ఒకచూపు– మిణుగురులాంటిచూపు– ఇంతకన్న మరేంచెయ్యరు. ఈ ఒక్కచూపే వారిని ఆ పూలపుంతలో కాలూనేలా చేస్తుంది. ఆ పూల తోవలో నడవడమనేదివుండదు. గాలికి అలా అలా తేలిపోవడమే. ఇలాంటి మానసిక పరిస్థితి ఎప్పుడూ తీవ్రమైన ఉద్వేగంతో ప్రక్కనే ఉండనే ఉంటుంది. ఒకరినొకరు ఎంతో ప్రేమించు

కుని వ్యక్తులలో ఇరువురిలోనూ ఎప్పుడూ ఒకేరకమైన ఉద్వేగం ఉండదు. నిర్మలమైన ఆకాశంలోని తళుకుతో మనం ఈ సంధ్యావస్థను పోల్చవచ్చు. ప్రకృతి మనం తొలిగాచూచినప్పుడు ఒక సన్నని వలిపపు ముసుగువేసుకున్నట్టుగా కనుపిస్తుంది. ఆ తరువాత ఆ వెలుగు వలయం నల్లని కాంతులీనుతున్నట్టు తోస్తుంది. అగాధమైన వెలుగుచీకటిలాగానే కనుపిస్తుంది. అప్పుడు హెన్రీలోనూ ఆ స్పానిష్ బాలికలోనూ ఒకే విధమైన ఉద్వేగాలు కలిగాయి. స్టాటిస్టిక్స్ సూత్రాన్ని అనుసరించి రెండు ఒకేవిధమైన శక్తులు పరస్పరం కలిసినప్పుడు ఒకశక్తిని మరొకటి తుడిచివేస్తుంది కాబట్టి ఈ విషయంలోనూ అదేసూత్రాన్ని వర్తించవచ్చు.

ఇక ఆక్షణం తాలూకు బరువు ఆ ముసలిది అక్కడే కాటి నక్కలా కాపలాఉండడంవల్ల మరింత ఎక్కువైంది. ప్రేమ ఒకొక్కసారి సంతోషంగానూ భయంగానూ పరిణమిస్తూ ఉంటుంది. ప్రేమకు అర్థంలేని విషయమంటూ ఏదీలేదు. ప్రేమ దృష్టికి ప్రతిదీ శుభసూచకంగానో లేక అశుభసూచకంగానో కనుపిస్తుంది. అక్కడున్న ఆ ముసలిది ఒక రానున్న ప్రమాదాన్ని సూచించే అశుభసూచనలాగా కనుపిస్తున్నది. ఒకపెద్ద చేపతోకలాగాఉంది. ఆ ముఖంలో ఏదో దాగిన మోసం కనుపిస్తుంది.

హెన్రీ స్వేచ్ఛాభావుకుడు కాకపోయినా గొప్ప శక్తిగల వ్యక్తి కావడంచేత ఈ విచిత్రమైన సంధి అతనికి ఆశ్చర్యజనకంగా కనుపించింది. అదీకాక శక్తివంతులు సహజంగా ఎక్కువ ప్రభావం కలిగినవారై ఉంటారు. వారికి లేనిపోని

విశ్వాసాలుకూడా ఎక్కువగానే ఉంటాయి. విశ్వాసం అనేది విచిత్రంగా ఏర్పడుతుంది. తొలిగా మనకు తోచినభావాలు ఒక్కోసారి విశ్వాసాలై కనుపిస్తాయి. ఆ భావాలు ఒక్క మనకే మాత్రమే కనుపిస్తాయి. ఇతరులకు కనుపించనూ కనుపించవు. వారి మనస్సుకు తోచనూతోచవు. ఈ సద్బుధ్ధిక్షణం వల్ల ఆ స్పానిష్ బాలికకు ఒక్కలాభం మాత్రం కలిగింది. ఆవిడ హెన్రీవంక తదేకంగా చూడసాగింది.

ఎన్నాళ్ళనుంచి తను హృదయంలో దేవుణ్ణి కొలిచినట్టు కొలుచుకుంటూ తదేకంగా ధ్యానిస్తూవచ్చిన ప్రియుడు తన తపస్సుకుమెచ్చి సాక్షాత్కరిస్తే అతనివంక ఎలా చూస్తుందో అలా హెన్రీని చూస్తోంది. ఆవిడకళ్ళనిండా ఆనందంనిండి జలజలలాడుతోంది. అంతా ఆనందమే. వెలుగుతీగలుసాగినట్టు వెలికివస్తూంది. ఆ అమ్మాయి మంత్రముగ్ధం అయిన కన్యలా కూచుంది. ఎన్నాళ్ళనుంచో తనుకన్న కలను ఇప్పుడు కనులారాతాగి నిర్భయంగా ఆస్వాదిస్తోంది. అప్పుడు ఆ అమ్మాయి హెన్రీకి ఒక అద్భుతావహమైన సౌందర్యమూర్తిగా తోచింది. చుట్టూఉన్న చిరుగుబట్టలూ, వృద్ధాప్యం, మాసిన ఎరుపు సోఫా దుప్పటీ, పచ్చని చాపలు, సున్నంలేని గోడల ఇటుకలూ, ఈ శిథిల భోగమంతా ఒక్కక్షణంలో అదృశ్యమైపోయింది.

గది ఒక్కసారిగా తళుక్కుమని వెలిగినట్టయింది. ఒక మబ్బుతెరలోనుంచి మాత్రమే ఎర్రని సోఫాపైముాగి పిల్లలా కూచున్న ఆ బాలికను చూడగలం. ఆ అమ్మాయి పసుపు పచ్చని కళ్ళలో విధేయత చెప్పకనే తొంగిచూస్తూఉంది.

అభాగ్యత కారణంగా ఏర్పడిన విధేయత. ఒక నిరంకుశుని క్రిందఉండే బానిసకళ్ళలా దైన్యాన్ని ఒలకబోస్తున్నాయి ఆకళ్ళు. పంజరంలో పావురాయిలా బెదిరిబెదిరి పోతున్నాయి. బోనులో చిక్కుకుని తనకోపాన్ని తనలోనే దిగమింగుకునే పెద్దపులికళ్ళలా మినుకుమినుకు మంటున్నాయి.

'ఎవరా స్త్రీ?'- అని హెన్రీ పాకిటాను అడిగాడు.

పాకిటా సమాధానం చెప్పలేదు. తనకు ఫ్రెంచిభాష రాదన్నట్టు సైగచేశిచూపించి. హెన్రీకి ఇంగ్లీషువచ్చునేమో నని అడిగింది.

హెన్రీ తన ప్రశ్నను మళ్ళీ 'ఇంగ్లీషులో అడిగాడు.

'ఆవిడ ఒక్కతే నేనునమ్మకఉంచే స్త్రీ. ఆవిడ నన్ను అమ్మినా ఆవిడనే నమ్ముతాను', అన్నది పాకిటా ప్రశాంతంగా. 'నా ప్రియమైన ఎడార్ఫ్, ఆవిడ నాతల్లి. జార్జియా అందం కోసం కొనుక్కోబడిన బానిస. అప్పుడు జార్జియాలో ఇంతటి అందగత్తె ఉండేదికాదు. ఇప్పుడు ఆ అందంలో మిగిలిందేమీలేదు. తన స్వభాషతప్ప మరోభాష రాదు', అన్నది.

ఆ పిల్లా, తనూ ఇలా మాట్లాడుతూఉండగా ఆ స్త్రీ చూపిన తరహా హెన్రీకి కొంత చనువునిచ్చింది. పాకిటా చెప్పిన ఈ మాటలువిన్న తరువాత అతనిలో బరువు కొంత తగ్గింది. 'పాకిటా, అయితే మనకు స్వేచ్ఛ అనేది లేనేలేదంటావా?', అని అడిగాడు.

"ఎక్కడాలేదు", అన్నది ఆపిల్ల ఒకవిధమైన విషాదంతో. "ఇప్పుడుకూడా మనముందు కొద్దిరోజులుమాత్రమే ఉన్నాయి", అన్నది.

ఇలా అని కండ్లుదించుకుని ఎడమచేతి వ్రేళ్ళను కుడిచేతి వ్రేళ్ళతో లెక్కించింది.

అంతచక్కని చేతులు హెన్రీ ఎన్నడూ చూచిఉండలేదు.

"ఒకటి_ రెండు_ మూడు".

పన్నెండువరకూ లెక్కించింది. "అవును. పన్నెండు రోజులుమాత్రమే ఉన్నాయి", అన్నది.

"ఆ తరువాత?"

"ఆ తరువాత_", అన్నది_ ఉరితీసేవాని గొడ్డలికింద తలవంచిన ఒక బలహీనురాలిలాగా, ఒకవిధమైన భయంతో అలా అన్నది. ప్రకృతి ఆవిడకిచ్చిన అమృతశక్తినంతా ఆ భయం చెరిపివేసింది. చివరకు ఆ శక్తి ఆ అమ్మాయి ఎన్నెన్నో విచిత్రమైన సుఖాలను అనంతమైన గీతాలుగా మార్చుకోడానికిమాత్రమే పనికివచ్చింది.

"ఆ తరువాత", అన్నదిమళ్ళీ అవిడకళ్ళు నిర్నిమేషంగా చూడసాగాయి. ఎక్కడో దూరంగావున్న ఏదో భయానకమైన వస్తువును ధ్యానిస్తున్నట్టుగా తోచింది.

'నాకు తెలీదు', అన్నది.

'ఈ పిల్ల పిచ్చిపిల్ల', అనుకున్నాడు హెన్రీ తనలో తాను. అతనిలో విచిత్రమైన ఆలోచనలు కలగసాగాయి.

పాకిటా అతనికి తనదికాని దేనిచేతనో ఆవరింపబడి ఉన్నట్టుగాతోచింది. ఒక వైపున విచారమూ మరోవైపున ఉద్వేగమూ ఈ రెంటిమధ్యా ఊగిసలాడుతున్న స్త్రీలాగా తోచింది. ఆవిడ హృదయంలో మరొక ప్రేమ ఏదయినా ఉన్న దేమో? ఆవిడదాన్ని ఒకేమాటు జ్ఞాపకం తెచ్చుకోవడం మరిచిపోవడం చేస్తున్నదేమో? ఒకక్షణంలో హేన్రీ మనస్సులో అనేకవిధాలైన పరస్పర విరుద్ధాలయిన భావాలు పొడచూపసాగాయి. ఈపిల్ల అతనికి ఎాక అందని రహస్యంగా కనిపిస్తూవుంది. కొత్త ఆనందాలకోసం అర్రులుచాచే ఒక సామాన్య వ్యక్తిలాగా ఆ అమ్మాయిని ఎాక శాస్త్రీయ దృష్టితో చూస్తే హేన్రీకి పాకిటాలో ప్రకృతి ప్రేమకోసం సృష్టించివుంచిన గొప్ప అమూల్యసృష్టి గోచరింపసాగింది. ఆత్మవిషయం అలాఉంచి ఈ అమ్మాయి శరీర మంత్రపు కదలికలే హేన్రీకాక మరెవరినైనా భయచలితం కావించి వుండేవే కాని అతనుమాత్రం ఆ సుఖదనం ఫలించిన సింధైన కాపుచేత ఆకర్షింపబడ్డాడు కాని భయపడలేదు. ఆనందంలో అనుక్షణం కనుపించే ఆ వైవిధ్యం అతనికి ఆకర్షణీయంగానే తోచింది. ప్రతి మనిషి కలకనేది అదే. ప్రతిప్రేయసివాంఛా అదే.

ఈ అనంతమైన వైవిధ్యం అతన్ని రెచ్చగొట్టి అతనికి రెక్కలిచ్చి మానవుడు ఎంతగొప్ప తన్మయావస్థలకు ఎగరగలడో ఆ దూరాలకు అతన్ని లాక్కుపోవాలని. అందీ అందని ఆ ఆనంద నీలాకాశపు లోతుల్లోకి అతన్ని హాయిగా పక్షిని చేర్చినట్టు చేర్చింది.

ఆవిడ ఇప్పుడు తనను పూర్తిగా అవలోకించే అవకాశం ఇచ్చిందికాబట్టి ఇంతవరకూ అతను చూడని విషయాలు ఇప్పుడు హేస్రీ ఆ అమ్మాయిలో చూచాడు, ఎంతో అభినందించాడు. ఆ మెప్పుదల అతనిలో వొక రహస్యమైన కోపం కలగచేసింది, అతను ఆ అమ్మాయిని పూర్తిగా ముసుగు తీసి వొకమాటు ఆవిడవంక చూచాడు. అలాటి చూపులకు అలవాటుపడిన దానిలా ఆ స్పానిష్‌పిల్ల అతనివంక చూచింది.

'నీవు నాదానివి కాకపోతే, నాదానివి మాత్రమేకాకపోతే నిన్ను చంపుతాను', అన్నాడు.

ఆ మాట వినగానే పాకిటా ముఖం చేతులతో కప్పుకుని అమాయకంగా, "మేరీమాతా! నాకు నేనెంత తెచ్చుకున్నాను!' అని ఏడవసాగింది.

ఇలా అని చటుక్కున లేచి సోఫామీద వాలి తన తల్లి వక్షస్థలాన్ని కప్పిన చిరుగుబట్టలలో తల దాచుకుని ఏడవసాగింది. కూతురు అలావచ్చి దగ్గరచేరి ఏడుస్తున్నా ఆ ముసలిది మాత్రం తన నిశ్చల స్థితినుంచి ఏమాత్రం కదిలినట్లు కనుపించలేదు. శిలాప్రతిమలా అలానే కూచునివుంది, బర్బరజాతులకు సంబంధించిన ఆ గంభీరత ఆ తల్లిలో మూర్తి కట్టుకున్నట్టు కనుపించింది. ఒకశిలా ప్రతిమపై ఎంతటి జల్లులు పడినా ఎలా చలించదో అలా చలించకుండా వున్నది. ఆవిడ తన కుమార్తెను ప్రేమిస్తున్నట్లో మరి ప్రేమించనట్లో ఆ ముసుగుకింద ఏ మానవోద్వేగమైతేనారట్లాడడానికి అవకాశం వుంది _ మంచికాని _ చెడుకాని, ఆవిడ ఏ పని చేస్తుందన్నా నమ్మవచ్చు. ఆవిడ చూపు తనను ముసుగులా కప్పిన తన

కూతురి అందమైన జుట్టు పైనుంచి మెల్లగా హేన్రీ ముఖం వైపుకు ప్రయాణం చేసింది. ఒక అనిర్వచనీయమైన ఆశ్చర్యంతో అతనివంక చూచింది, ఏ విధివశాత్తు తను అక్కడికి చేరిందో — అంత చక్కని పురుషుణ్ణి ప్రకృతి ఏ మంత్రంవల్ల సృష్టి చేసిందో ఆవిడ అడుగుతున్నట్టుంది.

"ఈ ఆడంగులు నాతో పరాచికమాడుతున్నట్టుగా వున్నారు" అనుకున్నాడు హేన్రీ.

ఆ క్షణంలో పాకిటా తలెత్తి అతనివంక చూచింది. ఆత్మలోకి దూసుకునిపోయి కబళించే చూపు అది.

అప్పుడు ఆ అందాలరాశి తనది తప్ప మరెవరిదీ కాగూడదని అతను ప్రమాణం కావించేటంత అందంగా కనుపించింది.

"పాకిటా! నాదానివి కావూ?"

"నన్ను చంపుతావా?"— భయంగా అడిగింది. వణికిపోతున్న తీగలా కదులుతూ, అయినా ఏదో తెలీని శక్తివల్ల అతని వంకకే ఆకర్షింపబడుతున్న దానిలా అడిగింది.

"నిన్ను చంపుతానా?— నేను?"— అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

పాకిటా కలవరంతో సన్నని కేకలేసి వృద్ధురాలికి ఏదో ఒకమాట చెప్పింది. ఆ ముసలిది అధికారపూర్వకంగా తన కూతురి చేతినీ హేన్రీ చేతినీ తన చేతిలో పుచ్చుకుంది. ఇరువురివంక చాలాసేపు తదేకంగా చూచి ఆ చేతులు విడిచిపుచ్చింది, తరువాత ఏదో పెద్ద అర్థం వున్నట్టుగా తల ఊపింది.

"ఈ సాయంత్రం, ఈ క్షణం నాదానివి కావూ? నాతో కలిసిరావూ? పాకిటా"___

ఒక్క-క్షణంలో ఏవేవో పలుకులు హేన్రీ వానజల్లులా ఆ అమ్మాయిపై కురిపించచేసాడు. ఇరువంకలావున్న కొండ రాళ్ళకు డీ కొనిచప్పుడు చేస్తూ ప్రవహించే కొండవాగులా ఆ పలుకులు ప్రవహింపసాగాయి.

"అదే గొంతుక" అన్నది పాకిటా విచారపూరితమైన కంఠస్వరంతో, ఆవిడ ఇలా అనడం హేన్రీ వినిపించుకోలేదు.

"అదేతీరు" అనుకున్నది.

"అవును. అంతే" అన్నది వర్ణనీయంకాని ఒకవిధమైన అనాసక్తతతో.

"కాని ఈ రాత్రి – ఈ రాత్రి – ఎడాల్ఫి – లాకాం పానకు కొద్దిగా మాత్రమే నల్లమందు నిచ్చాను. ఆవిడకు ఏ క్షణానయినా మెలకువ రావచ్చు, అప్పుడు నాగతి ఏంకాను? ఈ క్షణంలో మా భవనంలో అందరూ నేను నా గదిలో నిద్రిస్తున్నాననే నమ్మకంతో వుంటారు. రెండురోజుల తరువాత ఇదేచోట ఇదే మనిషితో ఇదేమాట చెప్పు. అతను నాకు పెంపుడు తండ్రి. క్రిస్టిమొకు నేను ప్రాణంవంటిదాన్ని ప్రాణాలు పిండుతున్నా నామీద ఈగ వాలనివ్వడు. ఇక వస్తాను మరి సెలవా?"– అని హేన్రీ నడుము పుచ్చుకుని సన్నని తాచుపాములా అతని నడుముచుట్టూ చుట్టుకుని పోయింది.

అన్నివైపులా అతన్ని అదుముకున్నది అతని తలనెత్తి

అతనికి పెదవులు అందించింది, ఒక ముద్దు నిచ్చింది. ఇద్దరినీ ఆ ముద్దు ఒక పొగమంచువంటి మత్తులో ముంచి వేసింది, హెన్రీకి తన కాళ్ళకింద భూమి తెరుచుకున్నట్టు తోచింది. పాకిటా 'ఇక చాలు వెడదాం' అన్నది. ఆ కంఠస్వరంలో తను తనకి యజమాని కాదన్న విషయం విచారంగా స్ఫురించింది.

"ఇక వెడదాం" అంటూ అతన్ని చుట్టుకునే అతన్ని మెల్లగా మెట్లవరుస దగ్గరకు తీసుకునివచ్చింది. అక్కడ పాకిటా పెంపుడు తండ్రి వున్నాడు, పాకిటాను చూడగానే అతని కండ్లు వెలుగొందాయి. అతను హెన్రీని మెల్లగా వీధిలోనికి తీసుకుని వెళ్ళాడు. దీపాన్ని ఆర్పి కిందవుంచి తలుపు తెరిచి హెన్రీని బండి ఎక్కించాడు. మెరుపుతీగలా బండి తోలుకుని వెళ్ళి అతన్ని బోలివర్డ్‌కి ఇటాలిన్ చేర్చాడు.

ఈ దృశ్యమంతా హెన్రీకి ఒక స్వప్నంలా కనుపించ సాగింది. కాని అదిఎంతో చిత్రమైనకల. కల కరిగిపోయిన తరువాతకూడా ఒకఅతీతమైన ప్రణయమాధుర్యాన్ని విడిచి వెళ్ళే కల. మిగిలిన తన జీవితమంతా ఆమాధుర్యాన్ని వెదుకుతూనే మనిషి పరువులుతీస్తాడు. అలాటికల అది. ఒక్కముద్దు. అంతే చాలు. ఎన్నడూ ఇంతచక్కని సమాగమాన్ని చవిచూచి ఉండలేదు హెన్రీ. ఇంతకన్న సాలంకారంగానూ, నాజూకుగాను పవిత్రంగానూ ఏ సమాగమాన్ని అతను గడిపిఉండలేదు. ఒక ఆలయంలోకి వెళ్ళివచ్చినట్టుగా తోచిందతనికి. ఇలాటి పరిసరాలు, జుగుప్సాకరంగా కనుపించే దేవతాసన్నిధి. హెన్రీ ఊహకు ఆ తల్లి, ఇంతవరకు ఏ కవులుకాని చిత్రకారులుకాని ఊహించి ఎరుగని ఒక భీకరమూర్తిగా కనుపింపసాగింది. ఇంత

వరకు మరే సమాగమమూ అతనిలోని ప్రవృత్తిని ఇంతగా ప్రజ్వలింపచేసిందిలేదు. ఇంతకన్న సాహసిక సౌఖ్యాలు అతనికి చవిచూపిందీలేదు. అతనిలోని ప్రేమను మేలుకొలిపి అతనిచుట్టూ ఒక పొగమబ్బులా అలముకునేలా చేసిందీలేదు. అతనికి కలిగిన ఈ కొత్త అనుభవంలో ఏదోతీవ్రమైనది, విచిత్రమైనది, మధురమైనది, మృదులమైనది, కుంచితమైనది, విశాలమైనది, స్వర్గ సౌందర్యమూ భీకరతామిళితమైనదీ కనుపించి అతన్ని ఒక తాగినవానిలా అవశుణ్ణిచేసింది.

ఈ అనుభవం తరువాత అతను అతనుకాకుండా పోయాడు. అయినా తన ఉన్నత ప్రకృతినిబట్టి ఆ సుఖం తాలూకు అవశత్వాన్ని నిగ్రహించుకోగలిగాడు. ఈ కథ తాలూకు ఈ ప్రమాద సంఘటనలో, అతని ప్రవృత్తిని మరింత సుబోధకమయ్యేలా చెప్పాలంటే ఒకవయస్సులో అతని ఆత్మ ఎలా విస్తృతి పొందినదన్న విషయంకూడా చెప్పాలి. యువకులు సాధారణంగా స్త్రీలతో ఇలాటి ప్రణయ కలాపాలు సాగించే వయస్సులో వారి ఆంతరంగిక ప్రవృత్తి ఒక విధమైన విస్తృత పొందుతుంది. రహస్య పరిస్థితుల సమ్మేళనపై ఈ పరిణామం ఆధారపడి ఉంటుంది.

అధునాతన కాలంలో రాజులు ధరించే ఆజ్ఞాదండం కంటెకూడా ఎంతో శక్తివంతమైనది ఈ కుర్రాడి చేతిలో వుంది. న్యాయసూత్రాలు ఈ రోజుల్లోని రాజులకు ఎలాటి అధికారాలూ లేకుండా చేశాయి. ఒక ప్రాచ్యదేశాల నిరంకుశ పరిపాలకునిలా హెన్రీ తన అధికారాన్ని చలామణీ చేసుకుంటున్నాడు.

కాని అవి యీ రాజ్యాల్లో కేవలం పశుశక్తివల్లనే అమలు కావింపబడే ఈ శక్తి ఐరోపా తెలివితేటలవల్లనూ ఫ్రెంచి హాస్యధోరణివల్లనూ నిశితమై పదిరెట్లు ఇనుమడింపబడింది. ఫ్రెంచి హాస్యధోరణిలాంటి నిశితమైన మేధోసాధనం మనకు మరెక్కడా కనుపించదు. తన సుఖాలకోసం హెన్రీ తను చెయ్యగలిగినదంతా చెయ్యగలడు, ఎవరికంటా పడకుండ జరిగిన ఈ పని అతనికి సాంఘిక లోకంలో ఒక రహస్యమైన దీనిని తెచ్చిపెట్టింది. అది అతనిలోనుంచివచ్చినదే, లాయీ14కు తనని గురించి తనకుఎలాటిఅభిప్రాయం వున్నదో హెన్రీకి తనపై తనకు అలాటి అభిప్రాయం లేకపోవచ్చుకాని కాలిఫరో, క్సెరెక్సలు తాము ఎలా దేవాంశసంభూతులమని అనుకుంటూ వచ్చారో ఎలా చంపుతారనే భయంతో తమ ప్రజల కంటపడకుండా వచ్చారో హెన్రీకూడా తనను గురించి తాను అలాగే తలపోయసాగాడు, తనే జడ్జి తనే నేరస్థుడూ అయ్యాడు. ఏమాత్రం చింతపడక తనకు ఎవరు ఎదురుమాట చెప్పినా వారిని శిక్షించే స్థితిలో వున్నాడు.

ఒక సైనికుడై గడిపాడు, కాని అనుకున్న ప్రకారం ఆ సాయంత్రం అతనులేచి వున్నాడు. అతను బండికోసం ఎంతో కాలం కాచుకుని వుండలేదు, పాకిటా పెంపుడు తండ్రి వెంటనే హెన్రీ దగ్గరకువచ్చి తను వల్లెవేసిన ఫ్రెంచిమాటను అప్పచెప్పాడు, కలను ఇట్టే మార్పుచేయసాగింది.

ఆ మరుసటిరోజూ ఆ తరువాత రోజూ హెన్రీ ఎవరికీ కనుపించలేదు. ఏమైపోయాడో ఎవరికీ తెలీదు, కొన్ని పరిస్థితులలో మాత్రమే అతని శక్తి అతనిదగ్గర వుండేది. ఆ

రెండురోజులూ అతను, అతని విచిత్రమైన ఉనికికి కారణమైన భూతం కొలువులో ఆ పిల్ల మాత్రమే అతని కళ్ల ముందు ఊహా కన్యలా తోచసాగింది. ఆ రాత్రి అతనికి ఎన్నెన్నో కలలు వచ్చాయి, ఆ కలల్లో ఎన్నో చిత్ర విచిత్రాలైన రంగులు, అందని అందాలు, వెలుగుతో నిండినవవి. అదృశ్య ప్రపంచాలు కనుపింపసాగాయి, మధ్య మధ్యలో ఒక అడ్డు తెరజారి తన ఆ క్షణంలో మాత్రం ఆ మరుసటి క్షణం తాలూకు చింత లేకుండా అతను హాయిగా వున్నాడు. కుర్రాడిలాగా కులా సాగా వున్నాడు, అతను పడుకోబోతూకూడా ప్రేమనుగురించి తప్ప మరిదేన్ని గురించీ ఆలోచించలేదు. బంగారుకళ్ళ పిల్లనే ఊహించుకోసాగాడు. చక్రవర్తుల్లాగ నటించే వారంటే స్త్రీ లెంతో మక్కువ పడతారు, గిరిలో స్త్రీలు చూచే లక్షణాలు-వారి చూపులోని అహం సాహసం, చెప్పిన పని తక్షణం చెయ్యడం. ఇదే స్త్రీలు కలలు కనేదికూడా ఇదే హెన్రి.

బండితోలే వృద్ధుణ్ణి దహించడంవంటిది. ఈ విధంగా ఎన్నో గొప్ప లక్షణాలుగల ఈ యువకుని సంభాషణలోని వ్యంగ్యోక్తి అతనితో మాట్లాడేవారిని ఇట్టేభయపెట్టసాగింది. ఎవరూ అతనికి ఎదురుమాట చెప్పేవారుకారు, ఇలా తమ ఆడంబరంతో తామే విర్రవీగుతూ ఒక తప్పు ఒక దురదృష్ట సంఘటన వంటిది. ఒక బాడుగ బండిలో చిరునవ్వు చిందిస్తూ ప్రయాణం చేసే ఒక పారిస్ నగరవాసిపై పిడుగుపడి అతన్ని కాల్చి వేయడానికి మారుగా "మీరు రాదలచుకుంటే, ఆవిడ మీరు కళ్ళకు గంతలు కట్టుకుని రావడానికి ఇష్టపడింది" ఇలా అని క్రిస్టెమ్ ఒక సిల్కురుమాలు బైటికి తీశాడు.

"అవసరంలేదు" అన్నాడు హేన్రీ, అతనిలో అహం వెంటనే మొలకెత్తింది.

'అవసరంలేదు', అన్నాడు హెన్రీ. అతనిలో అహం వెంటనే మొలకెత్తింది. ఇలా అని వెంటనే బండి ఎక్క బోయాడు. క్రిస్టెమ్ సైగచేయగానే బండివెళ్ళిపోయింది.

'సరే'- అన్నాడు హెన్రీ తనకు దాపురువచ్చిన అదృష్టం కోల్పోతానేమోనని. అదీకాక అతను మూర్ఖునిలా కనుపిస్తున్నాడు. అతనితో వాదించి లాభంలేదనుకున్నాడు. క్రిస్టెమో ఈలవేశాడు. బండి తిరిగివచ్చింది. హెన్రీ త్వర త్వరగా బండిఎక్కాడు. అప్పటికే కొందరు ఈచిత్రం చూడ డంకోసం అక్కడ గొర్రెపిల్లల్లా కూడారు. హేన్రీ బలంలేని వాడుకాదు. బండి ఎక్కగానే ఎక్కడికి వెడుతున్నారో అడుగు తున్నట్టుగా అతనిచేతులు గట్టిగాపట్టుకున్నాడు. కాని లాభం లేదు. ఆ చీకటిలో అతనికళ్ళుమాత్రం మిణుగురు పురుగు లాగ మిలమిలలాడుతూ కనుపిస్తున్నాయి. హేన్రీ అలా అతని చేతులు పట్టుకోగానే అతను వదిలించుకుని హెన్రీని బండికిం దికి తోశాడు ఒకబాకుతీసుకుని ఈలవేశాడు. బండివాడు ఆ ఈలవిని బండి ఆపుచేశాడు. హెన్రి చేతులో ఏ ఆయుధం కూడాలేదు. అంచాత అతను లొంగక తప్పిందికాదు. చేరుమాలు వైపుకు తనముఖాన్ని అందచేశాడు. హెన్రీ అలా చేయగానే క్రిస్టమో చల్లబడిపోయాడు. ఒక విధమైన గౌరవంతోనూ శ్రద్ధతోనూ అతనికండ్లకు గంతలుకట్టాడు. తన దేవత ప్రేమించేవ్యక్తిపట్ల అతనుచూపే గౌరవంఅది. బండి

కదిలింది. 'వీడునన్ను చంపేశిఉండేవాడే', అనుకున్నాడు. హెన్రీ.

మళ్ళీబండి వేగంగాకదిలిపోసాగింది. ఇక పారిస్ బాగా తెలిసిన అతనికి తోవతెలుసుకోడానికి ఒకటేమార్గ ఉండుంది. తను ఎక్కడికి వెడుతున్నాడో తెలుసుకోవాలంటే తను శ్రద్ధగా కూచుని ఎన్నెన్ని కాలవలు బండిదాటిందో లెక్కించుకోవాలి. బండి ఏ ఏ పేటలు కూడళ్ళుదాటిపోతూందో లెక్కించుకోవాలి. అప్పుడుకాని అతనికి బండి ఏ వీధి మలుపు తిరుగుతున్నదో సీన్‌నదివైపుకు వెడుతున్నదో లేక మాంటిమార్ట్ వైపుకు వెడుతున్నదో తెలీదు. అప్పుడుకాని ఆ వీధిపేరుకాని ఆబండి ఆగినచోటుకాని అతను ఊహించుకోలేడు. కాని అతనిలోని సమరం అతనిలో కరిగించిన తీవ్రమైన ఉద్వేగము, రాజీపడినందువల్ల అతనిలో అభిమానంవల్ల ఇలా ఆప్రయాణం ఒక అరగంటసేపుసాగింది. బండి ఆగింది. కాని చూడగా అది ఒక వీధిలా కనుపించడంలేదు. క్రిస్టెమో బండివాడు హెన్రీని తమ చేతులతోదించి ఒక మేనాలో కూర్చోబెట్టారు. మెల్లగా ఒకతోటలోనికి మోసుకుని పోయారు. ఆ తోటలోని పూల పరిమళమూ అక్కడున్న చెట్లకు పచ్చికకూ సహజమైన పరిమళమూ అతని నాసికకు సోకుతూఉంది.

రేకెత్తినకోపము, అతనిలో అనేక రూపాలుగా మొలకెత్తిన ప్రతీకార భావాలు, ఆ పిల్ల తనని అక్కడికి తెప్పించడంకోసం తీసుకున్న ఈ శ్రద్ధ, ఈ కారణాలన్నిటివల్ల గ్రుడ్డివాళ్ళకు సహజంగా ఉండే ఆ దృష్టి అతనిలో పూర్తిగా ఈ జ్ఞాపకశక్తితాలూకు నిర్మలత్వాన్ని నశింపజేశాయి. ఆ

పరిమళం ఎంతో చిత్రంగా ఉన్నది. అక్కడ ఆ పరిమళం వెద జల్లి నట్టుగా ఉంది.

చీమ చిటుక్కుమన్నా వినిపించే నిశ్శబ్దం. తడి ఆకుల నుంచి మెల్ల మెల్లగా రాలుతున్న మంచుబిందువుల చప్పుడు కూడా వినవస్తూంది. ఇరువురూ అతన్ని ఒక మెట్లవరుస దగ్గ రకు తీసుకుని వెళ్ళి అక్కడ కాళ్ళమీద నిల్చుండబెట్టారు. చేతులు పుచ్చుకుని అనేక గదులలోనుంచి తీసుకుని వెళ్ళి చివ రకు ఒక గదిలో వదలిపెట్టారు. ఆ గదినిండా అత్తరులు గుబా ళిస్తున్నాయి. ఒక మెత్తని తివాచీ అతని అడుగులకు తగిలింది, ఒక స్త్రీ చెయ్యి అతన్ని తాకి పరుపుపై కూర్చుండ చేసింది. అతని కళ్ళకు కట్టిన సిల్కు రుమాలు విప్పింది. హేన్రీ కళ్ళు తెరవగానే పాకిటా ఎదురుగా కనుపించింది. ఆరోజున ఆవిడలో స్త్రీత్వం తాలూకు శోభంతా ఉట్టిపడుతూ ఉంది. హేన్రీ తానున్న గది వర్తులాకారంగా ఉన్నది. ఎంతో లలితంగా అలంక రించబడిన గది. ఎదురుగా గదిలోనుంచి వొక బంగారు ప్రమి దలో వెలుగుతున్న చిన్నారిదీపం కనుపిస్తూంది. వొకవైపు తలుపు తెరుచుకుని అతనులోనికివచ్చాడు. ఆ వాకిటికి చక్కని ముత్యాలతెర వ్రేలాడుతూంది. ఎదురుగా కిటికీ కను పిస్తూంది. అర్ధచంద్రాకారంగా ఉన్న ఆ గదిలో వొకచక్కని తుర్కీ తివాచీ విస్తారచేసిఉంది. ఆ తివాచీపై వొక పెద్ద పరుపు యీ భాగై అడుగులు వలయంగల పరుపు. ఆ పైన కాశ్మీర దుప్పటి కప్పారు. దుప్పటికి ఎర్రని తెల్లని చుక్కలు మిలమిలలాడుతున్నాయి. విశాలంగా ఉన్న ఆ పరుపుమీద ఎన్నెన్నో దిండ్లు మెత్తనివి పూలగుత్తులవంటివి పరిచారు

వొక సన్నని ఇండియాదేశపు మస్లిన్ తెర వ్రేలాడుతూంది. తెర తెరలుగా ఆ తెర చిరుగాలి పొరలకు ఊగిసలాడుతూఉంది.

ఆ మస్లిన్ చాటున అంతా గులాబీరంగుగా మారు తోంది. శృంగారం ఒలకబోసే రంగు గులాబీ కిటికీ తెరలు కూడా అదేరంగు పూసుకున్నాయి. తెరల అంచులకు గచ్చ కాయరంగు లేసులల్లారు. ఏడు వెండిపూత పూసిన చేతులు ప్రతి చెయ్యీ రెండేసి కొవ్వొత్తి దీపాలు పట్టుకుని వున్నాయి. అన్నీ సమంగావున్న దూరంలో అమర్చబడివున్నాయి. ఆ కాంతి, మదుగులాగ పరుపునంతా ఆక్రమిస్తూంది. పైకప్పుకు కూడా వెండిపూత పూశారు. దీపాల కాంతి ఆ పూతలో ప్రతి ఫలించి తళుకొత్తుతూంది, వెండిపూత కొద్దిగా మాసివుంది. అయినా తెల్లని కాంతిని జల్లులా కురుపిస్తూంది. తివాచీ ఒక శాలువాలా మెత్తగా కనుపిస్తూంది, పర్షియాదేశపు కవితా కల్పననంతా జ్ఞాపకం తెస్తోంది. ఎందరో బానిసల చేతులు ఆ చక్కని తివాశీని ఎన్నో దినాలు అల్లివుంటాయి. ఫర్ని చరంతా తెల్లని కాశ్మీర్ అల్లికలలో కప్పబడి వున్నది, నలుపు రంగు, గచ్చకాయ రంగు అలంకారాలు కనుపిస్తున్నాయి. గడియారం దీపాల ప్రమిదలు అన్నీ పాలరాతితో చేసినవే తెల్లని తారల్లా వెలుగులు విరజిమ్ముతున్నాయి. వొకచోట టేబిల్. టేబిల్‌పై కాశ్మీర్ అల్లిక పరిచారు, పూలకుండ్లలో గులాబీలు మరెన్నో రకాల పుష్పాలు, ఎరుపురంగువి తెలుపు రంగువి అలంకరింపబడివున్నాయి. కొద్దిలో చెప్పాలంటే అక్క డున్న ప్రతిచిన్న వస్తువూ ఏవో సున్నితమైన భావాన్ని ప్రతిమ చెక్కిన రీతిగా కనుపిస్తున్నది. ఇంతటి సున్నిత పుష్పం లాంటి సౌందర్యం మనకు మరెక్కడా కనుపించబోదు.

ఇంతటి భోగభాగ్యాలు ఈ సౌందర్యపు తెరలచాటున దాగినట్టు మరెక్కడా కనుపించవు. అక్కడున్న ప్రతివస్తువు వొక లావణ్యాన్ని వొక ఆనందాన్ని ప్రతి స్పందింపచేస్తూంది.

ఎంతటి శిలాహృదయుడైనా ఆ గదిలోకి అడుగుడితే చాలు చంద్రకాంత శిలలా కరిగిపోకపోడు. చిరుగాలి తెరలకు లలితంగా ఊగిసలాడే ముత్యాల తెరలు మన చూపులు ఒక్కొక చూపుకు ఒక్కొక రంగు మార్చుకుంటున్నాయి. ఒకసారి గులాబీ వన్నెగానూ మర్రోసారి తెల్లని పూలలాగానూ కనుపిస్తున్నాయి. ఆ తెరలచాటున వాతావరణమంతా ఒక మంచు తెరచాటున దాగిన రీతిగా వున్నది. ఆత్మ ఎంచాతనో కాని తెల్లనిరంగు వైపుకి ఆకర్షింపబడుతుంది. ప్రేమ ఎరుపు రంగు వైపుకు ఆకర్షింపబడుతుంది, ఉద్వేగాలు బంగారు రంగు రెక్కలు తొడుక్కుంటాయి. లలితమైన పక్షుల బారులాగ వినువీధుల్లో ఎగిరిపోతాయి. ఇలా మానవునిలో దాగిన అవ్యక్త విచిత్ర రహస్యాలన్నీ ఈ లలిత సానుభూతుల్లో ఇంద్ర ధనస్సులా పులకించి రంగు రంగుల రంగులీనుతాయి.

ఈ దృశ్యమంతా వర్ణాలన్నీ కలిసిపాడిన ఒకమధుర స్వరమేళలాఉంది. ఆ చల్లని గీతానికి ఆత్మ మయూరంలా బర్హంవిప్పి రంగురంగుల నృత్యం కావిస్తూంది. మనసు మత్తెక్కించే పరిమళాల బరువుతో తూగి సోలిపోతున్న ఈ అవ్యక్త వాతావరణంలో సాకిటూ తెల్లని వలిపాన్ని ధరించి హెన్రీ కండ్లముందునిల్చుంది. కాళ్ళకు చెప్పులులేవు. వెల్లికిలవేసిన చేపల్లా తళతళలాడుతున్నాయి. జుట్టు కనకాంబరాలు తీగలు సాగినట్టుంది. ఇలా కనుపించిన సాకిటూ హెన్రీ ముందు మోక

రిల్లి అతన్ని తనహృదయాలయ దేవదేవుని ప్రార్థించినరీతిగా ప్రార్థిస్తూంది. హెన్రీ చూడని పారిస్‌లోని అందచందాలేవీ లేవు. కాని విచిత్రంగాఉన్న ఈ చిన్నిగది అతన్ని ఆశ్చర్య చకితం చేసింది. సముద్ర తరంగాలనుంచి ఉదయిస్తున్న వీన స్‌లా కనుపించింది పాకిటా. అతను చీకటిలోనుంచి వెలుగు లోనికి రావడంవల్లనో ఆ వెలుగులో అడుగుపెట్టగానే అతని హృదయం ఆ వెలుగులో స్నానం చేసినట్టుతోచడం చేతనో, తను తొలిగా ఆవిడతో మాట్లాడిన సందర్భానికి ఈ సందర్భా నికి అతను పోలికలు చూచుకోడం వల్లనో, ఎందుచేతనో కాని నిజమైన కవిత మనకు ఎప్పుడో ప్రసాదించే ఒకలలిత మైన అనుభూతిని అతను పొందాడు. ఒక దేవకన్య క్షణంలో సృష్టించిన లోకంలా కనుపించే ఈ లోకంలో ఈ పిల్ల రంగు రంగుల కాంతులీనే ఒక దేవకన్యలా కనుపట్టసాగింది. రంగులూ, నీడలూ, పొగల తీగలూ, మెత్తని వెన్నెల తరకవంటి నును పైన శరీరమూ— ఇవన్నీ చూచేసరికి అతనిలోని కోపమంతా ఒక్కక్షణంలో కరిగిపోయింది. ఎరపైదుమికే గద్దలాగా తన ముందు మోకరిల్లిన ఆ అమ్మాయిని మోకాళ్ళపైనుంచి లేవ నెత్తాడు. గట్టిగా అదుముకున్నాడు.

ఒక అనిర్వచనీయమైన ఆనందం అతన్ని మత్తుగా చుట్టు కుంది. పూర్తిగా వికసితమైన ఆ పిల్ల అందాలు అతన్ని మెల్లగా కప్పుకున్నాయి.

"నా దగ్గరికి రావూ పాకిటా" అన్నాడు మెల్లని కంఠ స్వరంతో.

"మాట్లాడు. మాట్లాడు, అలా మాట్లాడు. ఇక్కడ

భయంలేదు"_ అన్నది. "ఈ ఆరామం ప్రేమకోసం నిర్మించింది. ఏ చిన్ని శబ్దమూ ఇక్కడినుంచి తప్పించుకుని పోవడానికి వీలుండదు. ప్రియుని కంఠస్వరంలోని తీయదనాన్ని సంగీతాన్ని అంత మక్కువతో ఈ ఆరామం తన కౌగిలిలో దాచుకుంటుంది ఎంత దగ్గరగా అరిచినా ఆ కేకలు ఈ గోడలు దాటిపోవు. ఒక వ్యక్తిని హత్యచేశినా అతని మూల్గులు ఎక్కడో ఎడారిమధ్య ఆరినట్టు ఆరిపోతాయి."

"అసూయను దాని అవసరాలు ఇంత చక్కగా అర్థం చేసుకున్నవారెవరు?"

"ఆ ప్రశ్న నన్ను ఎన్నడూ అడగకు" అన్నది. ఒక అద్భుతమైన తీయదనంతో ఆ యువకుని కంఠకు కట్టినరుమాలు విప్పుతూ అతని చక్కని మెడను చూడాలని అనుకున్నది.

"అవును. నేనెంతో ప్రేమించే మెడను ఇన్నాళ్ళకు చూచాను. నీవు నన్ను సంతోషపరచవూ?" అని అడిగింది.

ఆవిడ ఇలా అడిగిన ప్రశ్న-ఆవిడ అడగడంలో చూపిన లాలిత్యం హెన్రీని అతనప్పుడు మునిగివున్న సమాధినుంచి మేలుకొలిపాయి. వారిని ఎప్పుడూ నీడలా అంటిపెట్టుకున్న ఆ వ్యక్తి ఎవరాఅని తలపోస్తూ కూచున్నాడు హెన్రీ.

"ఇంతకూ ఇక్కడ పరిపాలించేదెవరో నేను తెలుసుకోవచ్చా?"_ అని అడిగాడు.

పాకిటా అతనివంక వణికిపోతూ చూచింది.

"అయితే నేను కాదన్నమాట" అంటూ ఆవిడ కౌగిలినుంచి తప్పించుకుని లేచాడు.

"నేను ఎక్కడవున్నా ఒంటిగావుండే అలవాటుంది", అన్నాడు. పాకిటా తల వెనక్కు వాలిపోయింది.

"కొట్టు కొట్టు" అన్నది ఆ బానిస భయంతో.

"నే నెవరనుకున్నావ్? మాట్లాడ వేం!" అన్నాడు హెన్రీ.

పాకిటా మెల్లగా అక్కడినుంచి లేచింది. ఆవిడ కళ్లలో నీళ్ళు నిండివున్నాయి, ఒక ఫర్నిచర్ పైనుంచి ఒక బాకుతీసి హెన్రీకి అందించింది. ఆవిడ అలా అందించడం చూస్తే పెద్ద పులికికూడా గుండె కరగకపోదు.

పురుషులు ప్రేమించేవారు ఎలాటి బహుమతి అంద చేస్తారో నాకూ అలాటి బహుమతి అందచేయి—నేను నిద్రించే టప్పుడు నన్నుచంపు. నీకు ఎలాజవాబుచెప్పాలో నాకు తోచడంలేదు. విను నామాట. నేనొక యజ్ఞకుండానికికట్టిన జంతువులాంటిదాన్ని మనల్ని విడదీసే అగాధానికి వంతెన వెయ్యగలగడం నాకే ఆశ్చర్యం కలిగిస్తూంది. నాకు కైపెక్కించు. నన్ను చంపు. వద్దు వద్దు!—' అని రెండు చేతులూ ముకుళించుకుని "నన్ను చంపకు. నాకు బ్రతుకంటే ఇష్టం. జీవితం నాకు ఎంతో అందంగా కనపిస్తోంది. నేనొక బానిసను కావచ్చు. కాని నేను రాణీనికూడ. నేను నిన్ను మాటలతో మాయచెయ్యగలను. నిన్నుమాత్రమే ప్రేమిస్తున్నానని చెప్పగలను. అలా నిన్ను నమ్మించగలను. ఒకరాజుగారి తోటలో నుంచి వెడుతూ తోవలో పూవును వాసన చూచినట్టు నన్ను ఆస్వాదించు అని నీతో చెప్పగలను. కాని ఆ తరువాత, ఒక స్త్రీలోని మధుర రహస్యాన్ని చూరగొన్న తరువాత,

ఆనందం రెక్కలుగా కట్టుకుని ఆకాశానికి ఎగిరిన తరువాత, నా దాహం చల్లని మంచులా మారెలా చల్లార్చిన తరువాత, నిన్ను అగాధమైన కూపంలో తోసివేయగలను. అక్కడ పడి పోయిన నిన్ను ఎవరూ చూడలేరు. ఆ కూపం సున్నపు బావిలా నిన్ను ఆహరించవచ్చు చివరకు నీవు మిగలకపోవచ్చు" ఆవిడ ఇలా చెబుతూంటే హెన్రీ ఆ పిల్లవంక నిశ్చలంగా చూచాడు. అతను అలా చూడడం ఆ పిల్లను ఆనందంలో ముంచింది.

'లేదు. నేను ఆపని చెయ్యను. నీవు ఇప్పుడు ఒక బోనులో కాదుఉన్నది. నిన్ను పూజించే ఒక అమ్మాయి హృదయంలో ఉన్నావు. ఆ లోయలోపడేది నీవుకాదు నేను', అన్నది.

'ఇదంతా చూస్తే చాలా చిత్రంగాఉంది', అన్నాడు హెన్రీ. 'కాని నిన్నుచూస్తే మంచి పిల్లలాగానే కనుపిస్తు న్నావు. కాని నీస్వభావంమాత్రం విచిత్రంగాఉంది. నిజం చెబు తున్నాను. నీవునాకు ఒకఅర్థంకాని సమస్యగా కనుపిస్తున్నావు. ఎంత ఆలోచించినా ఈ సమస్యకు సమాధానం కనుపించడం లేదు'___

ఆ యువకుడు అన్నమాటలలో ఒక్కటికూడా పాకి టాకు అర్థంకాలేదు. అతనివంక నిదానంగానూ మృదువుగానూ చూచింది. విశాలంగా ఉన్న నేత్రాలు విరివిగా విప్పారచేసి అతనివంక చూచింది. ఆ కళ్ళలో ఎంతో చెప్పరాని ఆనందం కనుపించింది.

"ఇలారా ప్రియుడా", అన్నది తన తొలిభావాన్ని మళ్ళీ జ్ఞప్తి చేసుకుని. 'నన్ను సంతోషపరచవూ?'

'నీవు ఏది కోరినా నేను అదిచేస్తాను. నీవు ఏది కోరక పోయినా అదినేను చెయ్యకపోను' అన్నాడు హెన్రీ నవ్వుతూ. అతని కులాసా మళ్ళీ అతను తెచ్చుకున్నాడు. తన అదృష్టపు నిచ్చెనకు ఆఖరుమెట్టు చేరుకోవాలనుకున్నాడు. స్త్రీలను సహజంగా ఆకట్టుకునేశక్తి తనదగ్గర ఉన్నదనుకున్నాడు. ముందు ఆ అమ్మాయితో కబుర్లాడి తరువాత ఆవిడ రహస్యా లన్నీ లాగవచ్చని అనుకున్నాడు.

"సరే నా కోరిక ప్రకారం ఏర్పాటు చేస్తాను" అన్నది.

పాకిటా ఆనందంతో ఒక టేబిల్ దగ్గరకు వెళ్ళి ఒక డ్రాయర్ లోనుంచి ఒక ఊదా రంగు వెల్వెట్ రోబ్ తీసి హెన్రీని చక్కగా ఆ రోబ్ తో అలంకరించింది. తరువాత అతని తలకు స్త్రీలు ధరించే శిరో అలంకారాన్ని ధరింపచేసి అతనిచుట్టూ ఒక శాలువా కప్పింది. ఒక పసిపిల్లలా అమాయకంగా ఈ చిలిపి చేష్టలన్నీ చేశింది, ఏదో పక్షి రెక్కలు రెపరెపలాడించి నట్లు వెర్రిగా నవ్వసాగింది.

ఒక ఆనందక్షణంలో స్వర్గం ఒకరికొకరన్నట్లుగా సృష్టించిన ఈ ఇరువురి అనూహ్యమాధుర్యాలు చిత్రించడం కష్టమైనా ఈ యువకుని మనస్సులో కలిగిన ఊహాలను తాత్వి కంగా చెప్పడం అవసరం. డిమర్సెలాంటి సాంఘిక అంతస్తు గలవారు — అంటే అతనిలాగా జీవించేవారు — ఒక అమాయ కతను ఇట్టే కనిపెట్టివేస్తారు. కాని ఎంత చిత్రం! బంగారుకళ్ల పిల్ల కన్య కావచ్చు. కాని అమాయకురాలని చెప్పడానికి

మాత్రం వీలులేదు. అతిలోకత, వాస్తవికత; చీకటి వెలుగు; సౌందర్యం; భయానకత; ఆనంద ప్రమాదం; స్వర్గం నరకం;– ఈ ద్వంద్వాలన్నిటి విచిత్ర సమాగమం – డిమార్సె ఈ అమ్మాయితో మొదలెట్టిన ఉదాత్త ప్రణయ కలాపంలో మొలకెత్తసాగింది. అతిసుకుమారమైన సుఖాస్వాధన తొలూను శాస్త్రం. ఇంద్రియాలు చెప్పిన కవితఅనే ప్రణయం, ఈ అమ్మాయి కురిపించిన ఆనందపు జల్లులో పుష్పవనిలా వికసించింది. వెలుగు దీపాలవంటి ఆ అమ్మాయికళ్లు ఏవేవో చిత్ర చిత్రాలైన వాగ్దానాలు చేయసాగాయి.

ఆ అమ్మాయి ఒక ప్రాచ్యకవి పాడిన చక్కని గీతం. సాదీ, హాఫీజ్‌లు తమ గీతాలలో ఏ సూర్యకిరణాలు పోతపోశారో ఆ కిరణాలు ఈ గీతంలోనూ మిల మిల లాడుతున్నాయి. కాని ఒకమాట మాత్రం నిజం. సాదీచందస్సుకాని పిండార్ ఛందస్సు కాని ఈ తన్మయీా భావాన్ని వ్యక్తీకరింపలేవు. కలవరమూా స్తబ్ధతాగల ఈ ఆనందస్థితి ఎలాటిదో చెప్పలేవు. ఆ ఆనందం ఆ అమ్మాయిచుట్టూా వొక తాటిలా చుట్టుకున్నది.

'చని పోతున్నాను!' నేను చనిపోతున్నాను ఎడార్ఫి'– అన్నది.

'నన్ను ఈ లోకంకొసకు తీసుకుని వెళ్ళు. ఎవరూ కనుపించని ఏదైనా దీవికి తీసుకుని వెళ్ళు. మనం ఇలా పారిపోయిన ఆరాలు విడిచిపెట్టకు. మనం ఎక్కడికి వెళ్ళినా మనవెంట ఎవరో వస్తారు. నరకానికి వెళ్ళినా మనల్ని వదలరు. భగవంతుడా! ఎన్నాళ్ళకు ఈరోజు వచ్చింది! ఇప్పుడే తప్పించుకుని

కోదాంపద. మళ్ళీఎన్నడైనా నిన్ను చూడగలనా? అవును. రేపుచూస్తాను. ఎందుకుచూడను. అయినా ఆ ఒక్క క్షణం ఆనందంకోసం నేను నా కాపలాదారులకు నా ప్రాణాలు అందించాలి. రేపటివరకు...'

అతన్ని తన కౌగిట్లో గట్టిగా అదుముకున్నది. ఆ కౌగిట్లో మృత్యుభయం రెపరెపలాడింది. తరువాత ఆవిడ ఒక స్ప్రింగుతాకింది. గంటకు తగిల్చిన స్ప్రింగు. వెంటనే డిమర్సెను కళ్ళకుగంతలు కట్టుకోవలసిందని కోరింది.

'నేను అలాచెయ్యకపోతే- ఇక్కడే ఉండడం నాకు ఇష్టమవ్వుతే-'

'నా మృత్యువును నీవు మరింత దాపుకు తెచ్చినవాడి వవుతావు' అన్నది. 'నేను ఇప్పుడు చనిపోయానంటే అందుకు నీవే కారణం అవుతావని నాకు తెలుసు', అన్నది.

హెన్రీ సరేనని ఒప్పుకున్నాడు. ఆనందం చవిచూచిన వ్యక్తిలో ఒకవిధమైన మరుపు వెంటనే కలుగుతుంది. ఒక విధమైన విరక్తత్వం, స్వేచ్ఛకోసం వాంఛ, ఎక్కడికో వెళ్ళిపోవాలనే కోరిక, దేనిని చూచినా వొక విధమైన అనాసక్తి— ఇలాటివన్నీ ఏర్పడుతాయి. కొద్దిలో చెప్పాలంటే ఇలాటి లక్షణాలన్నీ అతనికి తలనంపులు కలగచేస్తాయి, అవ్యక్తంగా కనుపించే ఇలాటి భావాలు వొక స్వర్గకాంతివల్ల వెలుగొందింపబడినవికావు. రసార్ద్రిత జలలూరేలా తీయని పవిత్రమైన జలనుంచి పుట్టినవికూడా కాదు. లార్డ్ ఎడ్వర్డ్ అద్భుతకృత్యాలను రూపొందించుకొని స్ఫురింపచేసింది ఇలాటి రసార్ద్రితే. నోవలెహె

లోసి లేఖలకు ముగింపుకూడా ఇదే. రిచర్డ్సన్ గ్రంథాలే కనక రూసోకు ప్రేరేపణ నిచ్చినవి అయివుంటే ఎన్నో అంశాలలో ఇరువురి గ్రంథాలకును ఎంతో తేడా కనుపిస్తూంది. అంచాతనే అతని రచనలు అద్భుతంగానూ స్వయం ప్రతిభా యుతంగానూ కనుపిస్తున్నాయి. అన్వయానికి పృథః కరణకు కూడా అందని అందాలు ఆ గ్రంథాలలో రూసోగుప్పించాడు. అంచాతనే ఆ గ్రంథాలు అంత రసపూరితంగా కనుపిస్తాయి. లార్డ్ ఎడ్వర్డ్ అద్భుతకృత్యాలలో ఎంతో కనుపిస్తుంది.

నిజమైన ప్రేమకు అందని ఆ విచిత్రమైన భావం అప్పుడు హెన్రీని ఆవరించింది, అప్పుడు అది అవసరమే కూడా. ఎన్నెన్నో జ్ఞాపకాలు అతని మనస్సులో తలుకొత్తసాగాయి, నిజమైన ప్రేమ జ్ఞాపకాలన్నిటికి అతీతమైంది. అధికమైన ఆనందంవల్లకాని ఉద్వేగంవల్లకాని హృదయంలో ముద్ర వద లని స్త్రీని మనం ఎలా ప్రేమించగలం? హెన్రీ విషయంలో పాకిటా ఈ రెండువిధాలా అతని హృదయంలో హత్తుకుని పోయింది. కాని ఈ క్షణంలో మాత్రం తన ఆనందం తననే ఆవరించి ఉండడంవల్లను తన శరీరం తాలూకు తీయని విషా దం తనని పొగమంచులా చుట్టుకుని ఉండడంవల్లను హెన్రీ తన హృదయాన్ని తాను పరిశీలించుకోలేకపోయాడు. తన జీవి తంలో చవిచూచిన ఎన్నో జీవనదుల్లాంటి ఆనందాలు తన పెదవులతో జ్ఞాపకం తెచ్చుకుందామని యత్నించినా ఆ యత్నంలో విఫలుడయ్యాడు.

తెల్లవారుతూ ఉండగానే అతను బోలివార్డ్ మాంట్ మార్ట్రె వెళ్ళాడు. తిరిగి వెడుతున్న బండివంక అమాయకంగా

చూడసాగాడు. జేబులోనుంచి రెండు చుట్టలు తీసి కూలీలకు బ్రాందీ కాఫీ అమ్మే ఒక సాధు స్వభావంగల స్త్రీ దుకాణం లోని దీపానికి చుట్ట వెలిగించాడు. పారిస్ ప్రజ ఉదయాన్నే పనిపాటలకు వెళ్ళే వేళకు ఆ స్త్రీ తన దుకాణం తెరుస్తుంది. తరువాత చక్కగా చుట్ట కాల్చుకుంటూ పంట్లాం జేబుల్లో చేతులు పెట్టుకుని 'నందోరాజాభవిష్యతి' అన్న తీరుగా కులా సాగా నడవసాగాడు.

"చుట్టలో ఎంత మహాత్మ్యం వుంది! మనిషికి గొత కలి గించని వస్తువు ఇదొక్కటేకదా", అనుకున్నాడు.

అప్పుడతనికి బంగారుకళ్ళ పిల్లకూడా జ్ఞాపకం రాలేదు. తాను ఆ పిల్లతో కులాసాగా ఆనందంలో మునిగి ఉండగా ఆ పిల్ల మృత్యువును గురించి మాట్లాడింది. ఆ అందకత్తె నుదు టిపై ఆ క్షణంలో ఒక చిన్ని మబ్బుతునక కమ్మినట్లయింది. ఆ అమ్మాయి చరిత్రకూడా చాలా చిత్రంగానే ఉంది. పుటక ఒకదేశం, తల్లిది మరోదేశం, విద్య మరోదేశంలో ఆ అమ్మాయి అతనికి ఒక విచిత్రమైన ఊహాకన్యలా కనుపింపసాగింది.

"ఆ అమ్మాయి హవానాలో పుట్టింది. స్పానిష్ మండలం. ఈ కొత్తప్రపంచంలో అలాటి ప్రదేశం మరెక్కడా కనుపించదు. అంచాతనే నాముందు పారిస్ స్త్రీలాగా శృంగా రాన్ని కాక భయాన్ని నటింపసాగింది. ఒకొక్కసారి స్త్రీలలో భయంకూడా అందంగానే కనుపిస్తుంది. ఇంతకూ ఆ అమ్మాయి బంగారు కళ్ళు ఎంతచల్లగా ఉన్నాయి. ఆ కళ్ళ నీడల్లో వాలి అలా హాయిగా నిద్రించాలనిపించింది".— అను కున్నాడు.

ఒక బాడుగబండి ఫ్రాసక్కటి మూలలలో వేచిఉండడం

చూచాడు. బహుశా ఏ జూదగానికోసమో ఆబండి అక్కడ వేచి ఉంటుంది. అతను ఆ బండి డ్రైవర్‌ను నిద్రలేపి ఇంటికి వెళ్ళి అలసిపోయినవాడిలా హాయిగా నిద్రపోయాడు. అలాటి నిద్ర ఎంతో అమాయకంగా ఉంటుంది.

మధ్యాహ్న మయ్యేసరికి కాని డిమర్నె నిద్రలేచి ఒళ్లు విరుచుకోలేదు. వెంటనే అతనికి ఎంచాతనో ఆకలివేస్తున్నట్టు తోచింది. యుద్ధంలో గెలుపుపొందిన మరుసటిరోజు ఉదయం వృద్ధులైన సైనికులకు వేసే ఆకలివంటిదిఅది. వెంటనేవెళ్ళి పాల్‌ను చూడాలనిపించింది. పాల్‌తో కలిసి భోజనం చేయాలని పించింది.

పాల్ దగ్గరికి వెళ్ళగానే 'ఏం స్నేహితుడా! ఇన్నాళ్లూ ఎక్కడున్నావు? బంగారుకళ్ళ పిల్లతో కాలంగడుపుతున్నావా?' అన్నాడు,

"బంగారుకళ్ళపిల్ల! ఆ అమ్మాయిని ఎన్నడో మరిచిపోయాను. కొత్త చేపలుపట్టాలి!"

"రకరకాల రుచులు చూస్తున్నావా?"

"ఏం? అలా చెయ్యగూడదా?"- అన్నాడు హెన్రీ నవ్వుతూ. "అబ్బాయ్ మార్పువల్లనే తరతమభేదాలు తెలుస్తాయి. నామాటవిను... అహా... ఏంలేదు... ఇప్పుడు చెప్పను. నీకు ఇప్పుడు ఆ విషయం చెప్పబోవడంలేదు. జీవితం నదివంటిది. వ్యాపారంసాగేనదివంటిది. జీవితమంతటిలోకి అతి పవిత్రమైంది చుట్ట. నేను సాంఘికశాస్త్రం నీకుబోధించడం లేదులే, ఇకపద. భోజనంచేశివద్దాం. నా బుర్ర నీకోసం ఖర్చు చెయ్యడంకన్న ఒక ఆమ్లెట్‌కోసం ఖర్చుచెయ్యడం చౌక".

'మిత్రులతో కూడా బేరాలు చేస్తున్నావా?'

"అదికాదబ్బాయ్"- అని చెప్పసాగాడు హెన్రీ. వ్యంగ్యోక్తికి అతనికి ఎప్పుడు అవకాశం కలిగినా అతను వదలడు' నీవూ ఒకరోజున ఇలా తరతమ వ్యత్యాసాలు చూడవలసిన అవసరం రావచ్చు. నీమీద నాకు ఎంతో మక్కువ ఉన్నదికాబట్టి నీకు ఈ విషయం చెబుతున్నాను... అవును... నిజంగానే నీవంటే నాకెంతో ఇష్టం. నీ బుర్ర బద్దలై పోకుండా ఉండడంకోసం నీకు ఒక వెయ్యిఫ్రాంక్ లనోటు అవసరమవుతే ఇదుగో- ఇక్కడుంది ఆనోటు- తీసుకో. నీవు రేపు ఎవరితోనైనా పోట్లాడవలసిన అవసరం ఉన్నపక్షంలో నీకు పోట్లాడే స్థలాన్ని సిద్ధంగాఉంచుతాను. పిస్టళ్ళుకూడా సిద్ధంగాఉంచుతాను. నేనుకాక మరెవరైనా నీ వెనక నిన్ను నిందిస్తే అతని విషయమేమిటో చూస్తాను. అబ్బాయ్ నీకు తరతమవిమర్శన ఎలా ఉంటుందో చెప్పనా? ఇలాటి విమర్శన రెండు విధాలుగా ఉంటుంది. ఒకటి సచేతనమైనది. రెండవది దోషదర్శకమైనది. దోషదర్శకమైన విమర్శన వట్టి అశక్తులుమాత్రమే చేస్తారు. వారు ఏవిషయాన్ని గురించి ఏమీమాట్లాడరు. ప్రతి విషయాన్ని నిరసిస్తారు. కాని సచేతనమైన తరతమ విమర్శన ఇలా ఉండదు. అది ఒకవిషయాన్ని గురించి నిర్ణీతంగా చెబుతుంది. ఈ సాయంకాలం క్లబ్ కు వెళ్ళినప్పుడు నేను బంగారుకళ్ళపిల్లకు నేను ఊహించినంత విలువలేదు', అంటాననుకో. అప్పుడు అంతా ఏమంటారో తెలుసా? "ఆ పని పాటా లేని డిమార్సె అన్నమాట విన్నారా? అతను అప్పుడే బంగారుకళ్ళపిల్లనుపొందినట్టుగా మనల్ని నమ్మించాలని ఇలా చేస్తున్నాడు.

ఇలా తనపోటీదారులనుంచి తప్పుకోవాలని చూస్తున్నాడు. ఇతను పైకి కనుపించేలా వెర్రివాడేంకాదు', అంటారు. కాని ఇలాటి తగాదా కేవలం అల్పమైనది. అసహ్యామైనది. ఎవరు ఎలాటి నమ్మరాని అబద్ధ మాడినా నమ్మేవాళ్ళు కొందరుం డకపోరు. అన్నిటిలోకి ఎక్కువదైన వివేచన స్త్రీలు తమభర్త లనుంచి వదిలి మరొకరిని వరించే సందర్భంలో చేసే వివేచన. మనకు సంబంధించని ఒక వ్యక్తితో, మనం ప్రేమించే ఒక వ్యక్తికోసం ఆ వ్యక్తిని రాజీపరచవలసి ఉంటుంది. దీన్నే స్త్రీ-తెర అంటారు...... అడుగో లారెంట్ వచ్చాడు. ఏమిటి విశేషం?'

"ఎవరో ఆస్టెండ్ ఆస్టియర్స్ తమకోసం వచ్చారు మాన్షియర్."

"పాల్, మన అనుబంధాలకు సంబంధించిన రహస్యాలు లోకానికి తెలవక లోకాన్ని వెర్రిదాన్ని చేయడంలో ఎలాటి మజా ఉన్నదో నీకు ఒకనాటికి తెలుస్తుంది. అర్థంలేని ఈ మందపరిధికి ఆవలగా ఉండడంలో నాకెంతో ఆనందం ఉన్నది. ఈ మందకు తనకు ఏంకావాలో తనకే తెలీదు, తననుంచిఇతరులు ఏం కోరుతున్నారోకూడా తెలీదు. ఆ మందనుంచి దూరంగా వుండడంలో ఎంత ఆనందంవున్నది. ఆమందలో కొన్ని భావాలు కలిగించి మనం వాటికి దూరంగా ఉండడంలో ఎంతో వినోదం వున్నది. ఎవరైనా దేనికైనా గర్విస్తున్నారంటే అది వాళ్ళు స్వయంగా ఆర్జించుకున్న శక్తులకోసం మాత్రం కాదు. దానికి కార్యకారణాలు రెండూ అతనే అవుతాడు, సూత్రమూ ఫలి తమూకూడా అతనే అవుతాడు. నిజానికి నేను దేన్ని ప్రేమి

స్తున్నానో దేన్ని కోరుతున్నానో ఏ వ్యక్తికీ తెలియదు. బహుశా నేను ప్రేమించినదీ నేను కోరినదీ ఒక నాటకమంతా జరిగిన తరువాత ఆ నాటకంలో కథ తెలిసినట్లు తెలియవచ్చు కాని నా ఆట ఇతరులకు చూపడం ఒక బలహీనత, పొరపాటు అవుతుంది. మోసమంటే నాకు తగని చిరాకు, మోసం బలాన్నికూడా ఓడిస్తుంది. నవ్వుతూ నేను ఒక రాయబారి పాత్ర ధరించనా? నీకు జీవితంలో ఆశయాలేమీ లేవా? నీవు ఏదీ కావాలని అనుకోడం లేదా?"

"హెన్రీ – నీవు నన్ను ఎగతాళి పట్టిస్తున్నావు, నీవు నాకు విలువ నివ్వడంలేదు."

"మంచిది పాల్. నిన్ను చూచి నీవు నవ్వుకోడం ఇలాగే సాగిస్తే ఇతరులను చూచికూడా నవ్వగలుగుతావు?"

భోజన సమయానికి డిమర్సె మళ్ళీ చుట్టలు వెలిగించాడు. రాత్రి జరిగిన సంఘటనలన్నీ ఇప్పుడు అతనికి స్పష్టంగా కనుపిస్తున్నాయి. గొప్ప తెలివిగలవారిలాగా అతనికికూడా నెమరు ఎప్పుడంటే అప్పుడు రాదు. వెంటనే అతని దృష్టి లోతులకు పోదు. ప్రస్తుతంలోనే జీవించే అలవాటు ఉండటం చేత అతని మనోనేత్రం సహజంగా నిద్రపోతూనే ఉంటుంది.

డిమర్సె పరిస్థితులుకూడా ఇలాటివే. మొదట్లో తన తెలివినంతా తన సుఖాలకోసం వినియోగించాడు. ఆ సుఖాల నన్నిటిని తనలో బాగా ఇంకించుకున్న తరువాత ఆనాటి మేధావులలోకల్లా గొప్పవాడైనాడు. మనిషి ఇలానే ధృఢపడిపోతాడు. స్త్రీ తనను ఉపయోగించుకోకుండా ఉండడంకోసం తను స్త్రీని ఉపయోగించుకుంటాడు.

ఈ క్షణంలో డిమర్సెకు ఒకవిషయం స్ఫురించింది. బంగారు కళ్ళపిల్ల తనను మోసంచేసిందన్న విషయం స్ఫురించింది, ఇప్పుడతనికి గతరాత్రి జరిగిన సంఘటనలన్నీ ఒక ప్రవాహంలా జ్ఞాపకానికి వస్తున్నాయి. అలా జ్ఞాపకం వస్తూండగా ఈ విషయం అతనికి స్ఫురించింది. చివరకు ఆపేజీ వెనకాల దాగిన అర్థాన్ని చదవగలిగాడు. కేవలమైన అమాయకత పోతపోసినట్టుగా ఉన్న పాకిటాశరీరం ఆవిడచూపిన ఆనందంలోని కలవరం, ఆ ఆనందంలో తొలిగా అస్పష్టంగాఉండి ఇప్పుడు స్పష్టంగా తోస్తున్న కొన్నిమాటలు,— ఇవన్నీకూడా అతను తనదికాని మరోపాత్ర తానుధరించాడన్న విషయం ఋజువుచేస్తున్నాయి. అతనికి తెలీని పతనం ఏదీలేదు. అన్నివిధాలైన వైపరీత్యాలకు అతను దూరంగానే ఉంటూవచ్చాడు. సంతృప్తినివ్వడంవల్ల మాత్రమే వాటికి జీవితంలో స్థానం ఉందని భావిస్తూ వచ్చాడు. ఏ పతనంకాని వ్యసనంకాని అతన్ని ఉలికిపడేలా చెయ్యగలిగేదికాదు. ఒక స్నేహితుణ్ణి ఎవరైనా ఎలా చూడగలుగుతారో అలా ఆ వ్యసనాన్ని చూడగలిగేవాడు. అతను భావించిన విషయం నిజమే అయినట్లవుతే అతనిలోని ఏదో సున్నితమైన ప్రదేశానికే ఇప్పుడు దెబ్బతగిలిందని చెప్పాలి. ఆ ఒక్క అనుమానమే అతన్ని కోపంతో నింపింది. ఒక లేడిపిల్ల ఆటకుచిక్కిన ఒక పెద్దపులిలా గర్జిస్తూ అక్కడినుంచి లేచాడు.

"ఏమిటిది?"— అన్నాడు పాల్.

"ఏమీలేదు."

"నా మీద ఏదైనా కోపముంటే చెప్పు. లేకపోతే రేపు తగాదావస్తుంది".

"నేనిప్పుడు ద్వంద్వయుద్ధాలలోకి దిగడంలేదు.

"ఇదినాకు మరింతవిచారకరంగా కనుపిస్తూంది.'

"అన్నమాట చేస్తాను"

"అబ్బాయ్! ఇవాళ నీ పరాచికాలు ఎంచాతనోకాని చాలా ఘాటుగా కనుపిస్తున్నాయి"

"ఏం చెప్పను? ఆనందం చివరకు క్రౌర్యంలో అంత మవుతుంది. ఎందుకంటావా? ఆ విషయం నాకు తెలీదు. తెలుసుకోవాలనికూడా ఎన్నడూ ప్రయత్నించలేదు... ఇవుగో... ఈ చుట్టలు అద్భుతంగాఉన్నాయి... కొంచెం టీ పుచ్చుకో పాల్... సరే ఒక విషయం చెప్పనా పాల్. నేను గడిపే జీవితాన్ని జీవితమని అనడానికి వీలులేదు. జీవితంలో ఒక బాట ఎన్నుకోవలసిన సమయం వచ్చింది. జీవితాన్ని ఏదో ఒకవిధంగా సార్థకం కావించుకోవలసిన ఆవశ్యకతఉన్నది. లేకపోతే జీవితం అర్థంలేని ప్రహసనంలా తయారవుతుంది. నాకు నిజంగా భయంవేస్తూఉంది. అస్తవ్యస్తంగాఉన్న ఈ సంఘ వ్యవస్థనుచూస్తే నవ్వువస్తూంది. ఎందరినో చంపాడనే నెపంతో ఒక వ్యక్తి తలతెంచుతుంది ప్రభుత్వం. కాని వైద్యంపేరట పర లోకయాత్రచేసే ప్రాణాలవిషయం పట్టించుకోదు. మృత్యువును కూడా మించిన వ్యసనాలు సంఘాన్ని నానాటికీ పతనావస్థను చేరుస్తున్నాయి. కాని ఈ వ్యసనాలకు శిక్షంటూ ఎక్కడా కనుపించదు.... మరో టీ తీసుకునిరా... మనిషి

ఒకగారడీవానిలా కనుపిస్తూ ఉన్నాడు. ఇరు ప్రక్కలా లోతు లున్న ఒకకొండకొమ్మున నాట్యంచేసే ఒక గారడీ వానిలా ఉన్నాడు. 'లయసక్స డేంజరస్' అనే గ్రంథం ఎంతో ప్రమాద కరమైనదని అందరూ అంటారు. కాని అంతకంటె కూడా ప్రమాదకరమైన గ్రంథంఉన్నది. అసహ్యామైన గ్రంథం. భయానకమైనగ్రంథం. ఆ గ్రంథం ఎప్పుడు మూసుకోడ మనేది లేదు. ఎప్పుడూ తెరిచేఉంటుంది- ఆ గ్రంథం ప్రపంచంలో అంతకన్న ప్రమాదకరమైన గ్రంథం మరేదీలేదు. ఆ గ్రంథంలో మానవులు అనుక్షణం ఒకరిచెవుల్లో ఒకరు చెప్పుకునే రహస్యాలు సాయంకాల సమయాల్లో క్లబ్బుల్లో స్త్రీలు తమ వీవనలచాటున చెప్పుకునే గుసగుసలూ వినవస్తూ ఉంటాయి.'

'హెన్రీ, నీలో ఏదో అసాధారణమైన విషయం కనుపిస్తూంది. నీవు ఎంతసూక్ష్మబుద్ధివైనా ఈ విషయం మాత్రం స్పష్టంగా కనుపిస్తూంది'.

'సరే, కాని టీ బిళ్ళ దగ్గరికి వెడదాంపద. ఈ సాయంకాలం నేను ఎలాగో ఒకలాగడపాలి. అదృష్టం ఏమాత్రం కలిసివస్తుందో చూదాంపద'- అన్నాడు హెన్రీ.

హెన్రీ అక్కడినుంచి లేచి గుప్పిటనిండా బాంక్‌నోట్లు తీసుకుని వాటినిమడిచి సిగరెట్ కేసులో ఉంచుకుని ముస్తాబై పాల్ బండిలో ఎక్కి సెలూన్ డి ఎ ట్రేంజర్స్‌కు బయలు దేరాడు. భోజనసమయం వరకు అక్కడ పేకాడుతూ కూచున్నాడు. ఎంతో డబ్బురావడం పోవడంకూడా జరిగింది. సాయంకాలం కాగానే సంకేతానికి వెళ్ళి కళ్ళకుగంత కట్టించు

కున్నాడు. తరువాత ఎంతో శ్రద్ధతో మనస్సును కేంద్రీకరించి బండి ఏఏవీధులలోనుంచి వెడుతూఉందో పరిశీలింపసాగాడు.

రూ సెయింట్ లాజరెలోగుండా బండి వెడుతున్నట్టు హోటల్ సాన్-రీల్ దగ్గర తోటగేటుముందు బండి ఆగినట్టు అతనికి స్ఫురించింది. గేటులోనుంచి బండిపోగానే పూర్వం వలెనే అతన్ని ఒక డోలీలో కూర్చోబెట్టారు. క్రిస్టెమె బండి వాడు ఇరువురూ కలిసి అతన్ని మోసుకుని వెళ్ళారు. వారి అడుగులచప్పుడును బట్టి అతనికి అలాతోచింది. అతను స్వేచ్ఛగా ఉండిఉన్నట్లవుతే అతను ఒక పూ మొగ్గను ఏరుకుని ఎలాంటి ప్రదేశంలో తాను ప్రయాణంచేస్తున్నదీ కనిపెట్టి ఉండేవాడే. అతన్ని ఒక పెద్దభవనంలోకి తీసుకుని వెళ్ళారు. అదంతా ఒక కలలా కనుపించిందతనికి. కాని- అతని పనులన్నీ మేధస్సుకు సంబంధించినవీ- శరీరానికి సంబంధించినవీ- అతనికి ఒక విధమైన అనాసక్తి నే కలిగించాయి. సన్నని వానజల్లు పడుతూఉంది. భూమి తడిగాఉంది. రాత్రివేళల్లో కొన్ని చెట్ల పరిమళాలు పగటివేళలకన్న ఘాటుగా ఉంటాయి. హెన్రీకి ఆ పరిమళాలన్నీ గుబాళిస్తూ సోకినవి. ఈ పరిమళాన్ని బట్టి ఆ భవనం ఎక్కడఉన్నదో అతను కనుక్కోగలిగాడు.

తన మేనా వెళ్ళేమలుపులుకూడా గమనించాడు.

గతరాత్రిలోలాగానే పాకిటా అదేగదిలో అదేమూల అదే ముక్కాలిపీటపై కూచుని కనుపించింది. తన కళ్ళగంత విప్పింది. కాని పాకిటా పోయిన రాత్రి ఉన్నట్టులేదు. ఆవిడ ముఖంలో మార్పుకనుపిస్తూఉంది. ముఖం వాడిపోయి పాలినట్టుగాఉంది. ఏడ్చినట్టు స్పష్టమవుతూఉంది. ప్రార్థిస్తున్న దేవ

తలా మోకాళ్ళపై కూచునిఉంది. కాని ఆ దేవత ముఖంలో ఇప్పుడు వెలుగు కనుపించడంలేదు. ఎంతో విచారంకనుపిస్తూ ఉంది. డిమర్సెను తన ప్రేమతో పావురాయినిచేసి రెక్కలు తొడిగి ఆకసానికి ఎగిరేలా చేసిన అందాల కుప్పకాదు ఇప్పుడా అమ్మాయి. ఆనందపు తెరచాటున కనుపించే ఆ విషాదంలో ఏదో హెన్రీని మంత్రబద్ధుణ్ణికావించింది. ప్రకృతి ప్రసవించిన ఒక కొత్తరకం పూవులా ప్రకృతి మలచుకున్న ఒక కొత్త ప్రతిమలా కనుపించింది. ఒకక్షణంపాటు అతను తన ఆలోచనలన్నీ మరిచిపోయాడు.

"ఏమిటి పాకిటా, ఇలాఉన్నావు?'

'స్నేహితుడా! ఈ రాత్రేనన్ను తీసుకునివెళ్ళు. నన్ను చూచి ఎవరూ 'అదుగో పాకిటా' అననిచోటికి తీసుకునిపో. చల్లని వెన్నెల చూపుగల అమ్మాయి, పొడవైనజుట్టుగల అమ్మాయి అదుగో', అని నన్నెవరూ వేలెత్తిచూపించని చోటికి తీసుకునిపో. అక్కడ నీకు ఎన్ని సుఖాలుకావాలని అనుకుంటే అన్ని సుఖాలు అందచేస్తాను. నన్ను నీకిష్టమైనన్నాళ్ళు పూవులా వాసనచూచుకో. ఆ తరువాత నామీద నీప్రేమమరిలితే నన్నువదులుతావు. అందుకుకూడా నేనేమీ అనను. ఎందుకని అడుగుతావా? నీతో గడిపిన ఒక్కరోజు చాలు. అదే ఎప్పుడూ నాకళ్ళకు ఒకజీవితంలా కనుపిస్తుంది.

"కాని నేను పారిస్‌విడిచి రాలేను పిల్లదానా"— అన్నాడు హెన్రీ. 'నేను స్వతంత్రుణ్ణికాదు. నాకోసం హామీ పడిన ఎందరివో అదృష్టాలు నాతో పెనవేసుకుని ఉన్నాయి.

కాని నిన్ను మాత్రం పారిస్‌లో క్షేమయిన దూరనిచోట ఉంచ గలను'.

'నీకు తెలీదు. స్త్రీశక్తిని నీవు మరిచిపోతున్నావు'.

ఎప్పుడూ ఏ గొంతుకలోనూ అంతటిభయాన్ని అతను వినిఉండలేదు.

"నీకూ ఈలోకానికీ మధ్య నేను నిల్చున్నప్పుడు నిన్ను ఎవరు అంటుకోగలరు?"

"విషం!" అన్నది ఆ పిల్ల. "డోనాకాంపా ఇప్పటికే నిన్ను అనుమానిస్తూఉంది..." అని చెప్పసాగింది. ఆ పిల్ల దాని చెక్కిళ్ళపై కన్నీళ్ళు ముత్యాలబొట్లలా రాలసాగాయి. 'ఇప్పుడు నా స్థితి పూర్వంలాలేదు. నీవు నన్ను ఇలానే విడిచి పెడితే ఆ ముసలిది నన్ను మింగకతప్పదు. అప్పుడు నీ కోరిక ఈడేరుతుందా! కాని, ఇప్పుడేరా. మనప్రేమలోని జీవనానం దాన్నంతా అనుభవిద్దాం. అవసరమవుతే నేను ప్రతిమాల డానికికూడా సిద్ధంగాఉన్నాను'.

"ఎవరిని"

"మోనాన్ని!"

"సరే నా గౌను ఇలాఇవ్వు"

'వద్దు. ఇప్పుడు ఎలాఉన్నావో అలాగేఉండు. ఇప్పటి లాగానే దేవతలాఉండు. ఇలాటిదేవతలను నేను ద్వేషిస్తూ వచ్చేదాన్ని. కాని నీ అంతఅందాన్ని ఈ ఆకాశంకింద నేన క్కడా చూడలేదు.' ఇలా అని హెన్రీజుట్టు సవరిస్తూ మళ్ళీ ఇలా చెప్పసాగింది. 'నేనెంత చిలిపిదాన్నో నీకు తెలీదు.

నేసింతవరకు నేర్చుకున్నదేమీలేదు. నాకు పన్నెండు సంవత్స రాలు వచ్చినప్పటినుంచి నన్ను ఎవరికంటికి కనుపించకుండా దాచిపెట్టారు. నాకు చదవడంరాదు. వ్రాయడంరాదు. ఇంగ్లీషు, స్పానిష్ తప్ప మరేభాషలూ రావు'

'మరినీకు లండన్‌నుంచి వచ్చే ఉత్తరాల విషయం ఏమిటి?'

'ఆ ఉత్తరాలా? చూడువాటిని'_ అంటూ జపనీస్ కుండులోనుంచి కొన్ని పేపర్లుతీసి అతని కిచ్చింది.

డిమర్సెకు కొన్ని ఉత్తరాలిచ్చింది. ఆ ఉత్తరాలు చూసేసరికి అతనికి ఎంతో ఆశ్చర్యంకలిగింది. ఉత్తరాలనిండా చిత్రమైన బొమ్మలున్నాయి. ఎన్నో ఉద్వేగపూరితాలైన మాటలున్నాయి. నెత్తురుమరకలు కనువిస్తున్నాయి.

అలా ఎవరో అసూయాపరుడు వ్రాసిన ఆ ఉత్తరాలు చూచి హెన్రీ ఆశ్చర్యంతో: 'నీవు ఎవరోనరకలోకపు ప్రతిభా శాలి గుప్పిటిలో ఉన్నట్లున్నావు', అన్నాడు.

'నరకమా?'_ అన్నది ఆ పిల్ల ఆశ్చర్యంతో.

"ఈ నరకంనుంచి ఎలా తప్పించుకోగలుగుతావో'.

"ఆ! అదేనా విశ్వాసం. మృత్యువుకూ కోపానికి మధ్య ఏదో ఒకబాట ఎన్నుకునే వరకూ డోనా కాంపాను తీసుకుని వచ్చాను. ఒక రాక్షసిఉండే అచ్చెరువు నాలోకలిగింది. నాకూ సృష్టికీ మధ్య వారుఉంచిన కంచువర్తులాన్ని బ్రద్దలు చేయాలనుకున్నాను. యువకులంటే ఎలాఉంటార్రో చూడా

లనుకున్నాను, నాకు మార్కిస్‌నూ క్రిస్టెమోను తప్పమరెవ రినీ తెలీదు. మాబండివాడు సేవకుడు కూడా వృద్ధులే'

'కాని నిన్ను ఎప్పుడూ మూసిపెట్టిఉంచరుకదా. నీ ఆరోగ్యం మరి ...?'

'ఆ అప్పను మేము షికారుమాత్రం వెడుతూఉండే వాళ్ళం. ముఖ్యంగా రాత్రి సమయాలలో. అదీ ఎక్కడో నగరానికి దూరంగా పొలాలదగ్గర సీన్ నదీతీరంలో'

"నీవు అలా ప్రేమింపబడి నందుకు నీవు గర్వించడం లేదా?'

'అదేంలేదు. ఏమాత్రం సుఖంలేదు. ఎన్ని ఉంటేమటుకేం? ఈ దాగుడు జీవితం వెలుగుతో పోలిస్తే చీకటికాకమరేమిటి?'

'ఏది వెలుగంటావు?'

'నీవే వెలుగువి. నా ప్రియమైన ఎడార్ఫి. నీవు వెలుగువుకావా? నేను ప్రాణాలైన ఇచ్చే నీవె వెలుగువు. నాకు వారంతా చెప్పిన ఉద్వేగాలూ, నేను నేర్చుకున్న ప్రేరేపణలూ అన్నీ నీకోసంకాదా? కొంతకాలం పాటు నాకు ఈ ఉనికి అసలు అర్థమయ్యేదేకాదు. కాని ఇప్పుడుమాత్రం ప్రేమ అంటే ఏమిటో అర్థమవుతూఉంది. ఇంతవరకు నేను ప్రేమింపబడిన దాన్నిగామాత్రమే ఉన్నాను. నా మటుకు నేను ఎవరినీ ప్రేమించిందిలేదు. నీకోసం ఎదైనా విడిచివస్తాను. నన్ను మాత్రం తీసుకుని వెళ్ళు. ఒక బొమ్మను తీసుకుని వెళ్ళినట్టు నన్ను తీసుకుని వెళ్లు. పగిలిపోయేవరకూ నీ దగ్గరేఉంటాను'.

అందుకోసం తరువాత నీవువిచారించవుకదా?'

"ఒక్క మాటుకూడా విచారించను', అన్నది కండ్లెత్తి అతనివంక చూస్తూ. ఆవిడ కళ్ళలో బంగారుకాంతి స్వచ్ఛంగానూ నిర్మలంగానూ కనుపిస్తూఉంది.

'ఇంతకూ నీ దయకు పాత్రమయ్యే అదృష్టం నాకేనా కలిగింది', అనుకున్నాడు హెన్రీ.

పాకిటా తన గతచరిత్ర హెన్రీకి చెప్పకుండాఉండినా దాని తాలూకు స్మృతిలేశంకూడా అతనికి ఒకనేరంగా తోచి ఉండేదే. అందుచేత- ఒకవైపున ఆకాశంనుంచి అవతరించిన దేవతలాఉన్న ఆవిడ ఆనందం అతన్ని ఆకర్షిస్తున్నా- కొంతవరకు మనస్సుచిక్కబట్టుకుని ఆవిడను పరిశీలింపసాగాడు. అయినా మరో వైపునుంచి ఆవిడ అందం అతన్ని ఆకర్షిస్తూనే ఉంది.

ప్రకృతి ప్రత్యేకంగా ఒకప్రయత్నం కాపించి ప్రేమకోసం పాకిటాను ప్రసవించినట్టుగాఉంది. ఒక్కరాత్రిలోనే ఆవిడ స్త్రీత్వంతాలూకు ప్రతిభ పాదరసంలా పరుగుతీసింది.

ఈ యువకునిశక్తి ఎలాటిదైనాకావచ్చు- సుఖాల విషయంలో అతను అనాసక్తుడూకావచ్చు- పోయిరాత్రి తరువాత ఆ అమ్మాయి కళ్ళలో ఒక ప్రేమికురాలైన స్త్రీ మాత్రమే సృష్టింపగలిగినకాంతి కనుపించింది. అలాటి కాంతిని పురుషుడు ఎన్నడూ కాదనలేడు. ఉదాత్త వ్యక్తులందరూ అనంతంకోసం పొందే ఉద్వేగానికి పాకిటా ప్రతిస్పందించింది. రహస్యమైన ఈ ఉద్వేగం ఫాస్ట్‌లో ఎంతో రసవత్తరంగా చిత్రించబడింది. మాన్‌ఫ్రెడ్‌లో ఎంతో కవితాత్మకంగా చూపబడింది.

కవులు కవితలోనూ శాస్త్రజ్ఞులు శాస్త్రంలోనూ భక్తులు ఈశ్వరునిలోనూ దీని కోసమే అన్వేషిస్తూ ఉంటారు.

ఏ అవధిలాంటి వ్యక్తిని పొందడంవల్ల నిరతమైన సంఘర్షణఉంటుందో అలాంటివ్యక్తిని పొందగలిగేఆశ డిమార్సెను కుతూహాలపరిచి అతన్ని వెర్రెత్తించింది. అతనినరాలు విచ్చుకున్నాయి. ఆ పరిమళభరితమైన వ్యక్తి సన్నిధిలో అతని ఘనీభావం ద్రవించింది. అతని రూళ్ళకర్ర సిద్ధాంతాలన్నీ కరిగి పోయాయి. ఆనందం అతని ఉనికికి గులాబీవన్నెపూసి తెలుపు అంచు తొడిగింది. ఒక అతీతమైన ఆనందం అతన్ని తేనీగలా కుట్టింది. ఇంతవరకు అతను నివసిస్తూవచ్చిన పరిధులు దాటి ఎక్కడికో ప్రయాణం చేశాడు. ఆ అనుభవం అతన్ని ఎక్కడికో చేర్చింది. ఈ పిల్ల అతన్ని అధిగమిస్తుందనికాదు. ఆవిడపట్ల ఇప్పటికే ఒకవిధమైన ప్రేమ ఏర్పడింది.

ఈ సాధనలో ప్రేమలో విజయం పొందాలనుకున్నాడు. ఆ పిల్లను మాలిమిచేయాలనుకున్నాడు. కాని అతను తనను తానే కోల్పోయే ఆరేఖదాటి ఆ సుకుమార దూరదేశాల్లో కలిసిపోయాడు. మృదుత్వం, దయ, విశ్వాసం అతనిలో నిండాయి. పాకిటాను ఇంచుమించు వెర్రెత్తించాడు.

'మనం సొరెంటో, నీస్, షివారీ ఎందుకు వెళ్ళకూడదు? మన జీవితాలు అక్కడ ఎందుకు గడపకూడదు?'_ అని అడిగాడు పాకిటాను.

"నాతో అలా చెప్పాలా? నన్ను అక్కడికి తీసుకుని వెడతావా?'_ అన్నది. 'నాకు ప్రత్యేకంగా ఒకవ్యక్తిత్వం ఉన్నదా? నేను నీలో భాగాన్నికాదా? నేను నీకు ఆనందం

1729

ఇస్తానని ఒకటేకాని నీవు మనకోసం ఒక విరామ ప్రదేశం కావాలంటే ఆసియాకుమించిన చోటులేదు. అక్కడ ప్రేమ పక్షిలా రెక్కలు విచ్చుకుంటుంది.'

"నీవు చెప్పిందినిజం. మనం ఇండీస్ వెడదాం. అక్కడ ఎప్పుడూ వసంతమే. అక్కడిభూమి పూలు మాత్రమే పూస్తుంది. అక్కడ మనిషి చక్రవర్తిలా మనవచ్చు. అక్కడ కాదన్నవారెవరూలేరు. ఈ వెర్రిదేశాల్లోని ఆచారాలు అక్కడఉండవు. ఆ బానిసల దేశంలోకి మనం వెడదాం. ఎప్పుడూ తెల్లగాఉండే భవనంపై అక్కడ సూర్యుడు కిరణాలు వెదజల్లుతాడు. అక్కడ గాలులు పరిమళాలు విరజిమ్ముతాయి. పక్షులు ఎప్పుడూ ప్రేమ గీతాలుపాడుతాయి. ఇక జీవించ దలుచుకోనప్పుడు ఎవరైనా జీవితం చాలించవచ్చు.'

"ఎక్కడ ఇరువురూ కలిసి ఒకే కౌగిలిలోచనిపోతారో–!' అన్నది పాకిటా. 'కాని, రేపు కాదు. ఈ క్షణానే బయలుదేరి వెడదాం... క్రిస్టెమోనుకూడా మనవెంట తీసుకుని వెడదాం', అన్నది.

'ఆనందం జీవితానికి శిఖరంలాంటిది, అంతకుమించిన శిఖరం జీవితానికి మరొకటిలేదు. మనం వెడదాం. కాని బయలుదేరాలంటే డబ్బుకావాలి. అందుకోసం పనులన్నీ సర్దుకోవాలి' ఆవిడకు ఈ మాటలు అర్థంకాలేదు. 'బంగారమా? ఇక్కడ కావలసినంతఉంది. ఇంతెత్తు బంగారం ఉన్నది', అన్నది చెయ్యెత్తిచూపుతూ.

'అదినాదికాదు'

"అవుతేమటు కేం?" "మనకు అవసరమవుతే మనం తీసుకుని వెళ్ళవచ్చు', అన్నది.

'అది నాదికాదు'.

'నీదికాదూ? నేను నీదాన్నికాదూ? మనం దాన్ని తీసుకుంటే అది మనదే అవుతుంది' అతనునవ్వాడు.

'పిచ్చిపిల్లా! నీకు ప్రపంచమంటే ఏమిటో తెలీదు', అన్నాడు.

'కాదు. నాకు ఇదిమాత్రంతెలుసు' హెన్రీని చూచి అమాయకంగా చిరునవ్వునవ్వుతూ.

ఈ క్షణంలో హెన్రీ అంతా మరిచిపోయినట్టుగా ఉన్నాడు. కాని ఒక బాకు దూసుకుంటూ వచ్చింది. హెన్రీ ప్రక్కకు తప్పుకున్నాడు. పాకిటా అతన్ని లేవదీసి 'ఓ మార్గరీటా!'; అన్నది.

'మార్గరీటా! ఇప్పుడు నేను ఇన్నాళ్ళూ నమ్మకుండా ఉండడంకోసం ఎంతో యత్నించిన దానిలో నమ్మకం కలుగుతూఉంది'— అన్నాడు యువకుడు.

అక్కడినుంచి లేచి బాకుఉన్నచోటికి వెళ్ళబోయాడు. కాని అదృష్టవశాత్తు డ్రాయర్ మూసిఉంది. అతనికోపం కొంచెం చల్లారింది. అక్కడినుంచి వెళ్ళి తన తాటిని తీసుకుని పాకిటా చేసిన నేరమేమో తెలుసుకోకుండానే ఆనిడపైకి వెళ్ళసాగాడు. పాకిటామాత్రం తన బ్రతుకు అరచేతిలో ఉన్నదన్న విషయం గ్రహించింది. ఒక్కదూకులో గది ఈ చివర

నుంచి ఆ చివరకు వెళ్ళింది.— డిమర్సె తన కంఠానికి తగిలించ బోయే తాటినుంచి తప్పించుకోడానికి. గదిలో అటూ ఇటూ పరుగులెత్తింది. ఎలాగో ఒకలా ఈ ఆట ముగుస్తుందని తన ప్రేమికుని కాళ్ళమధ్య ఒకదిండును విసిరేశింది. అప్పుడు అతను పడిపోయాడు. అది అదనుగా తీసుకుని గంటపలికే స్ప్రింగునొక్కింది. వెంటనే క్రిస్టెమోవచ్చాడు. డిమర్సెను క్రిందికి తోశాడు. తను పైబడితే పాకెట్సాసైగతో అతను తనని చంపుతాడనుకున్నాడు.

'నీవు నన్నెందుకు చంపాలను కున్నావు ప్రియుడా?'— అని అడిగింది.

డిమర్సె సమాధానం చెప్పలేదు.

'నీకు ఏవిధంగా కోపం తెప్పించానోచెప్పు'. అని అడి గింది. 'మాట్లాడు ఒకరిని ఒకరం అర్థంచేసుకుందాం', అన్నది.

హెన్రీ పరాజితుడైన ఒకవీరుడు ఎలాంటిసహానం వహి సాడో అలాంటి సహానంతో ఉన్నాడు. అతనిముఖం నిశ్చలం గానూ నిశ్శబ్దంగానూఉంది. ఇంగ్లీషువారి ముఖంలాఉంది ఒక క్షణమాత్రమైన అనాసక్తతతో తన గంభీరతను ప్రకటిం చాడు.

'ప్రియుడా మాట్లాడవేం? ఒకప్రేమ వీడ్కోలైనా చెప్పకుండా నన్ను వదిలిపెట్టకు. ఇప్పుడు నీవు నాకుకలిగిం చిన భయాన్ని నేను హృదయంలో ఉంచుకోను. మాట్లా డవూ?' అని అడిగింది.

డిమర్సె ఒక్కచూపును మాత్రమే సమాధానంగా ఇచ్చాడు. "నీవు చనిపోక తప్పదు", అన్నట్టుగా ఉంది ఆ చూపు. పాకిటా అతని దాపుకు వెళ్ళింది. "సరే, నన్ను చంపాలని ఉన్నదా? నా చావు నీకు ఆనందమిస్తే అలాగే చంపు'-అన్నది. ఇలా అని క్రిస్టెమోకు సైగచేసింది. క్రిస్టెమో మాట్లాడకుండా అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

"అతనూ మనిషంటే, స్నేహితుడంటే అలా ఉండాలి", అన్నాడు డిమర్సె అతనివంకచూపుతూ.

'అతన్ని నీ కిస్తాను అవసరమవుతే తీసుకో', అన్నది పాకిటా. "నన్నుఎలా కొలుస్తున్నాడో నేను మాట మాత్రం చెబితే నిన్నూ అలానేకొలుస్తాడు', అన్నది.

ఒక్కమాట అవునని అంటాడేమోనని ఎదురు చూచింది. కాని అలా అనకపోయేసరికి మృదువుగా ఇలా మాట్లాడసాగింది.

"ఎడార్ఫి, ఒక మాట దయగా నాతో మాట్లాడవూ? తెల్లవారవస్తోంది".

హెన్రీ మారుమాటచెప్పలేదు. అతనిలో ఒకచిన్న దోషం ఉన్నది. కొందరు చిన్నవిషయాలను పెద్దవిచేసి చూస్తారు. హెన్రీకి క్షమించడం చాతకాదు. ఆత్మలాలిత్యాలలో ఒకలలితత్వం అతనికి తెలీదు. ఇంగ్లీషువారికి సహజమైన ఒక తీవ్రత తన తండ్రిద్వారా అతనికి సంక్రమించింది. పాకిటా అలా అనడం అతనికి అసహ్యాకరంగాతోచింది. తను తన తీయని

విజయాన్ని కోల్పోయాననుకున్నాడు. ఆశ, ప్రేమ, అతని హృదయాన్ని వెలిగించిన దీపాలన్నీ ఒక చల్లనిగాలితాకి ఆరి పోయాయి. పాకిటాకు ఆ సమయంలో ఏంచేయాలో తోచ లేదు. అతన్ని వెళ్ళమని చెప్పాలని అనుకున్నది.

'దీనివల్ల లాభమేమిటి?' అన్నది కళ్ళకుకట్టిన రుమాలు ఇస్తూ 'అతను నన్ను ప్రేమించడం మానాడంటే, నన్ను ద్వేషించాడంటే అంతా అయిపోయినట్టే', అన్నది.

ఒక్క చూపుకోసం ఎదురు చూచింది. కాని ఆ చూపు లభించలేదు. సగం చచ్చినదానిలా పడింది. సేవకుడు హెన్రీ వంక ఒకమాటు చూచాడు. అతను అలాచూడడం అదే తొలిసారి. 'నీవు ఆ పిల్లను ప్రేమించకపోతే నీ ప్రాణాలు దక్కవు', అన్నట్టుగా ఉన్నదాచూపు. ఆ కొద్దిపాటిచూపులో అలాటిభావం హెన్రీకి గోచరమైంది. డిమర్సైను అక్కడినుంచి ఎంతో భద్రంగా తీసుకుని వెళ్ళారు. మసక కాంతిగాఉన్న ఒక వరాండాలోనుంచి నడిపించుకుని వెళ్లారు. చివరకు ఒక తలుపు లోనుంచి తోటలోకి వచ్చారు. సేవకుడు అతన్ని నిమ్మచెట్ల తోవగుండా మెల్లగానడిపించుకుని వెళ్లాడు. వీధిలోకి తోవ తీసే ఒక చిన్నగేటు దగ్గరకువచ్చారు. అప్పుడు అక్కడ ఎవరూలేరు. డిమర్సై అంతా జాగ్రత్తతో గమనించాడు. ఒక బండి అతనికోసం కాచుకునిఉంది. ఈ మాటు సేవకుడు అత నితో కలిసిరాలేదు. అతను వెడుతూ కిటికీలోనుంచి ఒక మాటు తోటచూడాలని తల వెలుపలికిపెట్టాడు. క్రిస్టెమో అతని వంకచూస్తున్నాడు. హెన్రీ కిటికిలోనుంచి ఒకమాటు అతనివంక చూచాడు. ఇరువైపులా స్పర్థసెలవేస్తూనేఉంది.

హెన్రీ పాకిటాను చంపడానికి నిశ్చయం చేసుకున్నాడని క్రిస్టెమోకు తెలుసు. తనను క్రిస్టెమో చంపాలని కోరుతున్నాడని హెన్రీకి తెలుసు. ఇరువురూ ఒకరిని ఒకరు బాగా అర్థం చేసుకున్నారు.

'ఈ ప్రణయకలాపం ఒక కథలా పరిణమిస్తూఉంది'- అనుకున్నాడు హెన్రీ.

"ఎక్కడికి వెళ్లాలి అయ్యగారు?'- అడిగాడు బండివాడు.

డినుర్సె, పాల్ డి మానర్ విల్లి ఇంటికి వెళ్ళాడు. ఒక వారంనుంచి హెన్రీ ఇంట్లో ఉండడంలేదు. ఈ సమయంలో అతను ఏంచేస్తున్నాడో ఎక్కడున్నాడో కూడా ఎవరికీ తెలీదు. ఈ పరారీ అతని ప్రాణాలుమాత్రం కాపాడిందికాని తనను ఎవరూ ప్రేమించనంతగా ప్రేమించి తనపైనే ఆశలన్నీ పెట్టుకున్న ఆ చక్కనిచుక్క ప్రాణాలుమాత్రం హరించింది. ఆ వారం చివరరోజున రాత్రి పదకొండు గంటలకు హెన్రీ ఒక బండిలో తోటచిన్న గేటు దగ్గరికి వెళ్ళాడు. నలుగురు. అతనితో కలిసివచ్చారు. బండిడ్రైవర్ కూడా అతని స్నేహితుడే. అతను బండిలోనేకూచుని జాగ్రత్తగా ఏచిన్నశబ్దమైనా వింటున్నాడు. మరి ముగ్గురు గేటువెలుపల వీధిలో నిల్చున్నారు. రెండవ వాడు తోటలోగోడకు ఆనుకుని వేచి ఉన్నాడు. చివరివ్యక్తి హెన్రీతో కలిసి లోనికివచ్చాడు.

'హెన్రీ, మనం మోసపోయాం', అన్నాడు మిత్రుడు.

'ఎవరివల్ల ఫెరాగస్?'

'వారు నిద్రపోవడంలేదు'- అన్నాడతను.

'ఇంట్లో ఎవరో ఇంకా తినకనో తాగకనో ఉంటారు... ఆతీరం చూడు!'

"మనకు ఈఇంటిప్లాను తెలుసు, ఈ కాంతి ఎక్కడ నుంచి వస్తున్నది?"

"నాకు ప్లానుతో అవసరంలేదు. మార్కిసిగదిలోనుంచి వస్తున్నది'.

"అలాగా, అవుతే ఆవిడ లండన్‌నుంచి వచ్చిందన్న మాట. నా ప్రతీకార అవకాశాన్ని దొంగిలించిందే!

'చూడు, చూడు, అదినిజం'- అన్నాడు ఫెరాగస్.

ఇరువురూ చెవులు నిక్కించుకుని వినసాగారు. సన్నని మూల్గులు వినవస్తున్నాయి.

'మీ మార్కిసీకి శబ్దం కిటికిలోనుంచి దూసుకుని పోతుందని తెలీదేమో?'- అన్నాడు ఫెరాగస్ నవ్వుతూ.

'మనకే అలాటి విషయాలన్నీ తెలుసు.'

ఒకక్షణం ఆగు. పైన .ఏం జరుగుతూఉందో చూచి వస్తాను. ఇంటి తగాదాలు ఎలాఉంటాయో చూడాలి'

హెన్రీ మెల్లగా మెట్లెక్కి వెళ్లాడు. ఆమెట్లు అతనికి పరిచితమైనవే. గదితోవ తీశే తోవను గుర్తించగలిగాడు. తలుపు తెరవగానే ఎంతటి గట్టిగుండెకలవానినైనా కలవర పరిచే సెత్తురు మరకలు- అతన్ని ఉలికిపడచేశాయి. అతను

చూచిన దృశ్యం అతనికి ఎన్నడూ కలగని ఆశ్చర్యం కలిగించింది.

మార్కిసీ ఒక స్త్రీ: స్త్రీ సహజమైన మెలకువతో తన పగతీర్చుకున్నది.

'ఆలస్యమైంది ప్రియుడా' అన్నది పాకిటా మృత్యువేదనతో హెన్రీవంక చూస్తూ.

బంగారు కళ్ళపిల్ల నెత్తుటి మడుగులో కళ్ళుమూసింది. కొవ్వొత్తి దీపాలవెలుగు, సన్నని పరిమళం, ఒక విధమైన అవ్యక్తత- ఇవన్నీ మార్కిసీ ఎంత కుహనా ముక్తితో తన నేరం చేసిందో ఋజువుచేస్తున్నాయి. తెల్లనిగది. నెత్తురు ఎర్రగా కనుపిస్తూఉంది. పోరాటం ఎంతకాలంసాగిందో చూపుతూంది. పాకిటా చేతులముద్రలు ఇంకా దిండ్లమీద ఆరిపోలేదు. అక్కడే ఆవిడజీవితాన్ని పట్టుకుని వ్రేలాడింది. ఇక్కడ తనను కాపాడుకున్నది. ఇక్కడకూలింది. రక్తసిక్తాలైన ఆవిడ హస్తాలతో ముత్యాల తెరలు చిరిగిపోయాయి. అక్కడ చాలాసేపు జీవితానికి వ్రేలాడిఉంటుంది. కిటికిదగ్గరికి వెళ్ళాలని యత్నించిఉంటుంది. నగ్నమైన ఆవిడ అడుగుల ముద్రల పరుపుకొసలో కనుపిస్తూనేఉన్నాయి. ఆవిడ శరీరం బాకుపోట్లతో మెలికలు తిరిగి హెన్రీ ఎంతో విలువగా చూచుకున్న తన ప్రాణాన్ని అర్పించడానికి ఎంత అల్లాడిపోయిందో తెలుపుతూంది. ఆవిడ నేలమీద వెల్లకిలాపడుకునిఉంది. మృత్యువేదనలో మదామ్‌డి సాన్-రీల్ కాళ్ళుకొరికి ఉంటుంది.

మార్కిసీ జుట్టు చిందరవందరగాఉన్నది. ఆవిడ శరీరా

న్నంతా కొరికిఉంటుంది. తనదేహంపై కొరికిన గాయాలు కను పిస్తున్నాయి. ఇంకా కొన్నిగాయాలు నెత్తురుజాలువారు తున్నాయి. దుస్తులు చిరిగిపోయి అర్ధనగ్నంగాఉంది. ఉరోజాలపై చీరిన గుర్తులుకనుపిస్తున్నాయి. ఇలా ఉదాత్తంగా కను పిస్తూంది. ఆవిడముఖం ఆతురంగానూ దేనికోసమో వేచి ఉన్నట్టుగానూ వెర్రిగానూ కనుపిస్తూంది. నెత్తురు వాసన వేస్తూంది. రొప్పిన ఆవిడనోరు తెరుచుకునిఉంది. ఆవిడ పున్నాగపూలవంటి నాసికలు ఊపిరి పీల్చుకోడానికి సరిపోయి ఉండవు. కొన్ని జంతువులు కోపంలో శత్రువుపై దూకి చంపు తాయి. ఆ తరువాత చంపిన ప్రశాంతిలో ఆవిషయం మరిచి నట్టు కనుపిస్తాయి. కొన్ని చంపినసంతోషం వెంటనే మరిచి పోవు. చంపిన ఎరచుట్టూ తిరుగుతూ ఉంటాయ. మార్కిసీ అలాఉంది. ఆవిడ హెన్రీని చూడలేదు. ఎవరూచూడరన్నంత హాయిగా ఒంటిగాఉంది. అదీకాక నెత్తురు కైపులోఉంది. ఇప్పుడు పారిస్ అంతా ఆవిడను చుట్టుముట్టినా ఆవిడగమనించే స్థితిలోలేదు. ఒక పిడుగుపడినా ఆవిడ ఇప్పుడు కళ్లుతెరవదు. పాకిటా కడపటి నిశ్వాసకూడా ఆవిడవినలేదు. ఆ మృతబాలకు ఇంకా తనమాటలు వినిపిస్తున్నవనే అనుకుంటూఉంది.

'పాపనివేదన చెప్పకుండా చనిపో', అన్నది.

'నరకంలోకివెళ్లు. కృతజ్ఞతలేనిదానా! అక్కడేపడి మగ్గిపో. అతనికి నీవిచ్చిన రక్తంకోసం నీ రక్తమంతా నాకు ఋణపడ్డావు. చావు! చావు! ఒకవెయ్యి మృత్యువులవేదవ అనుభవించు. నేను ఎంతో దయచూపాను. కాని ఈ ఒక్క క్షణమే నిన్ను చంపుతున్నాను. నాకు ఎన్నిహింసలు కలి

గ్గెట్టుచేశావో అన్ని హింసలూ నీకు కలగచేశేదాన్ని. కాని నేను బ్రతుకుతాను. తీరని దుఃఖంలో బ్రతుకుతాను. నాకు ఇక ప్రేమించడానికి ఎవరూలేరు- ఒక్క ఈశ్వరుడుతప్ప.'

ఇలా అని ఆపిల్లవంక చూచింది.

"చనిపోయింది"- అనుకున్నది ఒకక్షణం ఆగి "చని పోయింది. ఇక నేనూ దుఃఖంతో చనిపోతాను", అనుకున్నది.

మార్కిస్ పరుపుమీద వాలబోతూంది. ఇప్పుడుదుఃఖం ఆవిడను ముంచెత్తింది. ఆవిడనోట మాటలేదు. ఈక్షణం ఆవిడకు హెన్రీ డిమార్సె కనుపించాడు.

"ఎవరునీవు?"- అన్నది బాకుతీసుకుని అతనివైపుకు పరుగుతీస్తూ.

హెన్రీ ఆవిడచెయ్యి పట్టుకున్నాడు. అప్పుడు ఇరు వురూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకోగలిగారు. ఒకభీకర మైన ఆశ్చర్యం వారిరువురి నాళాల్లోని రక్తాన్ని మంచుగడ్డగా మార్చింది. వారి నరాలు పందిరిరీగల్లా అల్లలాడాయి.

ఇరువురూ ఒకేసారి :

"లార్డ్‌డడ్లీ నీకు తండ్రికదూ?"- అన్నారు.

ఇరువురి తలలూ అవునన్నట్టువాలాయి. 'తనసెత్తు రుకు తను విశ్వాసంచూపింది'- అన్నాడు హెన్రీ పాకిటాను చూపుతూ.

'ఆవిడ ఏం నేరం చేసింది!'- అని మార్గరీటా ఎఫీమియా ఫౌరాబెరిల్ పాకిటాశరీరంపై వాలింది. 'పిచ్చిపిల్లా! నీకు ప్రాణాలు పోయగలిగితే ఎంతబావుండును. ఎంత తప్పు చేశాను. పాకిటా! చనిపోయావు! నేను బ్రతికిఉన్నాను! కాని నాకన్న అభాగ్యురాలెవరూ ఉండదు'- అన్నది.

ఆ క్షణంలో పాకిటాతల్లి భీకరవదనం అక్కడ ప్రత్యక్షమైంది.

'చంపడంకోసం ఈపిల్లని నాకు అమ్మలేదని చెప్పడానికి వచ్చిఉంటావు'- అన్నది మార్కిసీ. 'నీవు నీపిల్లను ఎందుకు అమ్మావో నాకు తెలుసు. నీకు మరింత డబ్బిస్తాను. మాట్లాడకు' అన్నది.

ఒక దంతపు బుట్టలోనుంచి ఒక బంగారు సంచీతీసి వృద్ధురాలి కాళ్ళదగ్గర పడేట్టు విసిరివేసింది.

ఆ వృద్ధురాలి ముఖంలో అప్పుడే చిరునవ్వు కనుపించింది.

"నీకోసం సరైనక్షణంలో వచ్చానుచెల్లీ. న్యాయం నిన్ను వదలదు'- అన్నాడు హెన్రీ.

"అవసరంలేదు. ఈ పిల్ల మరణానికి లెక్కఅడిగేవాడు ఒకడేఉన్నాడు. క్రిస్టెమో. అతనూ చనిపోయాడు', అన్నది మార్కిసీ.

'మరి తల్లి విషయం?'- అన్నాడు హెన్రీ వృద్ధురాలిని చూపుతూ.

"ఆవిడపుట్టినదేశంలో స్త్రీలు బొమ్మలవంటివారు. వారిని కొనవచ్చు. అమ్మవచ్చు. ఇక్కడ ఈ ఫర్నిచర్ వస్తువులు ఎలాగో అక్కడ స్త్రీలు అలాటివారు. ఈవిడకు కూతురి ప్రేమనుకూడా మరిపింపచేసే కోరిక ఒకటిఉంది-'

'ఏమిటది?'- అన్నాడు హెన్రీ.

ఆ కోరికకు నీవు దూరంగా ఉంటావుగాక!'- అన్నది మార్కిసీ.

'కాని ఈ గుర్తులు మాపుచెయ్యడానికి నీకు ఎవరు సహాయపడతారు?'- అని అడిగాడు హెన్రీ.

'ఆవిడతల్లి'- అన్నది మార్కిసీ ఆ వృద్ధురాలిని చూపుతూ.

'మనం మళ్ళీకలుద్దాం', అన్నాడు హెన్రీ తనస్నేహితులను జ్ఞప్తికితెచ్చుకుంటూ.

"వద్దుతమ్ముడూ మళ్ళీ మనం కలిసే అవసరంలేదు. నేను మళ్ళీ స్పెయిన్ వెడుతున్నాను. లోడోలరె కాన్వెంట్ లో చేరడానికి వెడుతున్నాను'

"నీవు ఇంకా చిన్నదానివి. నీ అందం ఇంకా పూత

లోనేడుంది''_ అన్నాడు హెన్రీ ఆవిడను చేతుల్లోకి తీసుకుని ముద్దాడుతూ.

"సెలవు'', అన్నది. 'నీకు అనంతంగా కనుపించింది చేజారిన తరువాత ఇక నీకు శాంతి ఎక్కడుంది?'_ అన్నది.

ఒకవారం తరువాత పాల్ డిమానర్ విల్లి హెన్రీని టులరీలో కలుసుకున్నాడు. 'ఏమోయ్? నీ బంగారుకళ్ళపిల్ల ఏమైంది?'_ అని అడిగాడు.

'చనిపోయింది'



'ఎందుకు?'

"గుండెజబ్బు!''.

సమాప్తం



NEELIKALLU
By
BALJACK

A BHAVANI PUBLICATION
Price Rs. 1-50 nP.

---

## మా యితర ప్రచురణలు

| | |
|---|---|
| 1. మేలి ముసుగు. (సామర్ సెట్ మాఘం) | 3-50 |
| Do Special Edition | 4-50 |
| 2. తూర్పు - పడమరలు. (పెరల్ బక్) | 2-50 |
| 3. ప్రభావతి. (మహాకవి నిరాలా) | 2-75 |
| 4. స్త్రీవిలువ. (శరత్ బాబు) | 1-50 |

### బా ల సా హి తి

ఏండర్సన్ కథలు.

అనుసరణ :

శ్రీ ఆచార్య, యం. ఏ. బి. యిడి.,

| | |
|---|---|
| 1. ఉద్యానవనం | 0-10-0 |
| 2. నైటింగేల్ | 0-10-0 |
| 3. మంచురాణి | 0-10-0 |
| 4. థంబెలినా | 0-10-0 |
| 5. మంచి స్నేహితుడు | 0-10-0 |
| 6. అదృష్టవంతుడు | 0-10-0 |
| 7. పెద్దా - చిన్నా | 0-10-0 |
| 8. వీధిదీపం | 0-10-0 |

---

Wrapper Printed at Andhra Printers, Vijayawada-2.